విశ్వసాహిత్యమాల 40.

# సోవియట్ ప్రజాస్వామ్యం

సోవియట్ రచయితలు.

అనువాదం:

మహీధర జగన్మోహన్.

విశ్వసాహిత్యమాల,
రాజమండ్రి.

"యు. ఎస్. ఎస్. ఆర్. స్పీక్సు ఫర్ ఇట్సెల్ఫ్" సీరీస
వాల్యూమ్ 3

మాతృక
డెమోక్రసీ ఇన్ ప్రాక్టీస్
(సెప్టెంబరు 1941)
సోవియట్ రచయితలు

అనువాదం
సోవియట్ ప్రజాస్వామ్యం
(నవంబరు 1943)
మ. జగన్మోహన్

అవంతీ ప్రెస్, రాజమండ్రి
ఇ. జి. నెం 91, 19-11-46.
క్యూ. హెచ్. నెం. ఇ. జి. 75, కాపీలు 500.

వెల ముప్పావలా

# మా మా ట లు.

1940 లో యీ పుస్తకం యింగ్లీషులో వెలువడినతర్వాత సోవియటు లోనూ, ప్రపంచంలోనూ బ్రహ్మాండమైన మార్పులు జరిగిపోయినాయి. సోవియటు-జర్మనీ యుద్ధపర్యవసానంగా నాశనమైన పరిశ్రమలూ, వ్యవసాయం, పట్టణాలూ, కట్టడాలూ, కాలేజీలు—అన్నీ బహువేగంగా పునర్నిర్మించబడుతున్నాయి. కోటిన్నర సోవియటుపౌరులు, స్త్రీ, శిశు, బాల, వృద్ధులతోసహా జర్మన్ పైశాచికశక్తికి ఆహుతియైపోయేరు. అనేక కష్టసమస్యల్ని యెదుర్కొని, యిప్పటికప్పుడే సోవియట్ యెంతో ముందుకుబోయింది. తాత్కాలిక గృహనిర్మాణం, పరిశ్రమల పునఃస్థాపన, వ్యవసాయాభివృద్ధి, ప్రవాసితప్రజల్ని తిరిగి యథాస్థానాల్లో ప్రవేశపెట్టడం, అన్నీ కౌశలంతో, శిక్షణతో సాగిపోతున్నాయి. 1946—50 వరకూ 4 వ పంచవర్షప్రణాళిక వేయబడింది. 1941 జూన్ లో జర్మన్ దండయాత్రనాటికి వుంటిన పరిస్థితులను, వసతులను పునఃస్థాపించుటయేగాక ప్రతీరంగంలోనూ అభివృద్ధినిరికార్డుచేస్తున్నారు.

ఇప్పటికే యెన్నోపరిశ్రమలు, గనులు యుద్ధాత్పూర్వపు ఉత్పత్తిని చేయుచున్నాయి. వ్యవసాయం కొత్తప్రదేశాలకు చేరింది. ఎక్కువ యెకరాలుసాగు, ఎకరాకి యెక్కువపంటపండించడం — యుద్ధకాలంలోని అభివృద్ధుల్ని స్థిరపరచటం, యిదికూడా జరుగుతూంది. సోవియటు విధానంలోనే యీ ఉజ్జీవశక్తిఉందని తెల్లమే. ఆవిధానాన్ని తెలుసుకోడానికి ఈసీరిస్‌చాలా సహాయకరములు.

ఈ సీరిస్‌లోని మిగిలిన మూడు పుస్తకాల్నికూడా త్వరలోముద్రించి, సోవియటు రచయితలూ, పౌరులూ వారిదేశాన్నిగూర్చి ఏమనిచెబుతూన్నారో తెలిసికొనే అవకాశం మనప్రజలకు కలిగిస్తామని తలుస్తున్నాం. విదేశీయులువ్రాసిన వేలకొద్దీ గ్రంధాలకంటె సోవియటు జీవితంలోని మంచి సెబ్బరలను నిత్యం అనుభవిస్తూన్న ఆదేశపురచయితల వ్రాతలలో స్వారస్యం అధికమని, మా విన్నపం.

రాజమండ్రి,
15—11—46.

ఇట్లు,
మహీధర జగన్మోహన్‌రావు,
సంపాదకుడు.

# విషయ సూచిక.



షరా:— 'సుప్రీం సోవియట్'కు 'కేంద్ర శాసనసభ' అని వాడవచ్చును.

# సంపాదకీయ భూమిక

గత యిరవై యేండ్లలో సోవియట్ యూనియన్‌పై వందల కొలదీ పుస్తకాలు వెల్వడ్డాయి. వానిలో చాలమటుకు అక్కడి మానవ నాగరకతా విజ్ఞానాలను వినూత్న పంథాల్లో నడిపిస్తూన్న పరిశోధనల యెడల సానుభూతిని కనబర్చేవి అయినా యింకా కొన్ని సోషలిజం యెడల, రష్యాపట్ల అనవసరభయాలను దురభిప్రాయాలను వెలిబుచ్చినై. ఇన్నివందల్లో యేకొద్ది పుస్తకాలో మాత్రం నిజపరిస్థితులను నిష్పాక్షికంగా చూసి అవగాహన చేసికొన్న నిపుణులచేత వ్రాయబడినాయి.

"యు. ఎస్. ఎస్. ఆర్. స్పీక్సు ఫర్ ఇట్‌సెల్ఫ్" అనే ఈ సీరీస్‌లో ఒక విశిష్టత వుంది. ఇందలి ప్రతి రచయితా తాను వ్రాస్తూన్న విషయంలో ప్రత్యేక నిపుణుడై యుండుటేగాక, ఎకాడమీ ఆఫ్ సైన్సెస్ మెంబరుగానో, సోవియట్ కేంద్రశాసనసభా సభ్యుడుగానో—తరుచు రెండుగానూకూడా—సోవియట్ సమాజంలో ఒక గౌరవస్థానంలో వున్నవాడై యున్నాడు. ఈపుస్తకాల్లో సోవియట్ యూనియనుయొక్క విశ్వాసపాత్రమైన పూర్తిదృశ్యం మనకళ్ళయెదుట కానవస్తుంది.

1939 లో న్యూయార్కు ప్రపంచోత్సవం కొరకు వ్రాయబడిన వ్యాసాల్లో కొన్నిమాత్రమే యిచట ప్రచురిస్తున్నాం. అనాటికి రెండు పంచవర్షప్రణాళికలు పూర్తయినై. మూడోది ప్రారంభమైంది. సోవియట్ వివిధ జీవితరంగాల్లో ప్రతి నిముషం ముందుకు పోతూనేవుంది. 1940 నాటికే వుత్పత్తి యెన్నో రెట్లెక్కువైంది. అందుచే 1941 వరకూ ఆకొత్తవిషయాలుకూడా తెలియుటకై. స్టేట్‌ప్లానింగుకమిటీ అధ్యక్షుడు వాజ్నెసెన్‌స్కీ, సో. యూ. కమ్యూనిస్టుపార్టీ యొక్క

18 వ సమావేశంలో చదివిన రిపోర్టునుండి సంగ్రహింపబడిన విష యాలుకూడా యిందుతో యివ్వబడినై. (18 ఫిబ్రవరి 1941.)

"ఇక మనం సోవియట్ పౌరుల నిత్యజీవితం, విజ్ఞానాభి వృద్ధుల్ని చూద్దాం. మన జాతీయాదాయం క్రమప్రకారం యెక్కు వౌతూనేవుంది. దాంతోటి మన సామాజికసంపద, ప్రజల జీవిత వ్యయ పరిమాణంకూడా ముందడుగు వేస్తూనే వున్నాయి. ఎప్పటికప్పుడు వేల కొలదిగా కొత్తశ్రామికులు, సమిష్టివ్యవసాయకులు, విద్యాధికులు తయారై అత్యుత్సాహంతో వుత్పత్తి కార్యక్రమంలో పాల్గొనడం, శ్రామికుల వుత్పత్తిశక్తి యెన్నో రెట్లెక్కువగుట— యివే కారణాలు దీనికంతకీ."

"సోవియట్‌లో శ్రమజీవుల సంఖ్య దినదినం పెరుగుతోంది. కూలీలు, ఆఫీసుల్లో పనిచేసేవారి సంఖ్య 1937 లో 270 లక్షలనుండి 1940 కి 304 లక్షలవరకూ పెరిగింది అంచనా ప్రకారం యీసంఖ్య 1941 నాటికి 316 లక్ష లౌతుంది."

"సోవియట్ సర్వతోముఖ పారిశ్రామికాభివృద్ధితో శ్రామిక వర్గాన్ని వివిధశాఖల్లో, వివిధప్రాంతాల్లో సర్దుబాటు చేయవలసిన అవ సరం కలుగుతూంది."

"1940 నుండి స్టాలిన్ ప్రోత్సాహంతో వుత్సాహవంతులైన యువకులకు ట్రేడ్‌స్కూల్సు, ఫాక్టరీ ట్రైనింగు స్కూల్సులో ప్రత్యేక శిక్షణ నిచ్చి "స్టేట్ లేబర్ రిజర్వు" నిర్మాణం మొదలు పెట్టింది, ప్రభుత్వం. 1941 నాటికే యిట్టి శిక్షణ పొందిన యువకులు 7,94,000 మంది పరిశ్రమల్లోకి తీసుకోబడ్డారు. 1941 లో ట్రేడ్‌స్కూల్సుతో 3,50,000 కీ, ఫాక్టరీ ట్రైనింగుస్కూల్సులో 5,37,000 మందికీ శిక్షణ యివ్వడానికి యేర్పాట్లు జరుగుతున్నై."

"శ్రామికవర్గం యొక్క సంఖ్యాబలాన్నీ, వుత్పత్తి శక్తినీ యెక్కువ చేయడానికీ, పారిశ్రామికాభివృద్ధిని త్వరితం చేయుటకూ, జాతీయార్థిక వ్యవస్థయొక్క సోషలిస్టుప్లానింగును జయప్రదంగా కొనసాగించుటకూ, యీస్టేట్ లేబర్ రిజర్వు నిర్మాణవిధానం అతిముఖ్యం."

"సోవియటు ప్రజల జీవితవ్యయపరిమాణంతోబాటు వారి విజ్ఞాన విద్యాభివృద్ధులుకూడా సత్వరగతిని జరుగుతున్నాయి. 1938 లో ప్రజోపయోగకార్యాలకు ప్రభుత్వవ్యయం 3,520 కోట్ల రూబుల్సు; 1940 లో 4,170 కోట్ల రూబుల్సు; 1941 బడ్జెటు ప్రకారం, 4,780 కోట్ల రూబుల్సు యిందుకు ప్రత్యేకింపబడినై. అంటే 1940 లో కంటె 14·6% యెక్కువన్నమాట."

"స్కూలు పిల్లలు, కాలేజీవిద్యార్థుల సంఖ్యాభివృద్ధిని బట్టికూడ సోవియట్‌లో జరుగుతూన్న విజ్ఞానాభివృద్ధి గ్రహించవచ్చు. ప్రాథమిక. సెకండరీస్కూలు పిల్లలసంఖ్య 1941-42 లో 3,62,00,000 వరకూ పెరుగుతుంది. 1940-41 కన్న 3·4% యెక్కువ. యూనివర్శిటీ విద్యార్థుల సంఖ్య 6,57,000 అవుతుంది. 13% అభివృద్ధి."

"1941 లో జరిగిన విద్యార్థుల సంఖ్యాభివృద్ధి, పరిశ్రమల్లో ఇంజనీర్ల, టెక్నీషియన్ల సంఖ్యాభివృద్ధీ, మన ప్రజల వైజ్ఞానిక, పారిశ్రామికాభివృద్ధిలో ఒక నూతనాధ్యాయాన్ని ప్రారంభిస్తున్నై. మన సోషలిస్టు వుత్పత్తి కార్యక్రమంలో మూడే మూడు ప్రధాన విషయాలున్నాయి. ప్రజలు, వారి విజ్ఞానం, వారి వుత్పత్తిశక్తి."

"పంచవర్షప్రణాళికల కాలంలో సోవియట్ ప్రజలు విజ్ఞానంలో, శాస్త్రీయపరిజ్ఞానంలో యెంతో అభివృద్ధిచెందేరు. సోవియట్ సెన్సస్ లెక్కలు యీవిషయాన్ని సువ్యక్తం చేస్తాయి."

"1926-39 మధ్య సోవియట్‌లో జనాభా 16% యెక్కువైంది. శ్రామికులు, విద్యాధికుల సంఖ్య యింకా యెన్నో రెట్లెక్కువైంది.

| (ఎ) శ్రామికులు | అభివృద్ధి |
|---|---|
| మెకానిక్సు | 3·7 రెట్లు |
| టర్నర్సు | 6·8 రెట్లు |
| మిల్‌రైట్సు | 13·0 రెట్లు |
| లోకోమోటివ్ డ్రైవర్లు | 4·4 రెట్లు |
| ట్రాక్టరు డ్రైవర్లు | 125·0 రెట్లు |

| (బి) మేధావులు | అభివృద్ధి |
|---|---|
| ఇంజనీర్లు | 7·7 రెట్లు |
| శాస్త్రజ్ఞులు | 7·1 రెట్లు |
| అధ్యాపకులు | 3·5 రెట్లు |
| డాక్టర్లు | 2·3 రెట్లు |

ఈ పై లెక్కలు, సోవియట్ వైజ్ఞానికంగా, ఆర్థికంగా యెంత సత్వరాభివృద్ధిని జెందుతుందో తెలియజేస్తాయి."

# సోవియట్ ప్రజాతంత్రం

సోవియట్ యూనియనులో ప్రజలదే రాజ్యాధికారం. ఆ అధికార నిర్వహణం తమ సోషలిస్టు ప్రభుత్వం ద్వారా జరుగుతుంది.

సోవియట్ ప్రజాస్వామ్యసూత్రాలు మొదటిసారిగా 1917 విప్లవంలో పైకొచ్చేయి. తర్వాత సోవియటు ప్రజానీకానికీ, విదేశీయుల సహాయంతో వారి నింకా బానిసత్వంలో వుంచదలచిన ధనికవర్గానికీ జరిగిన వివిధ పోరాటాల్లో యీ సూత్రాలు యింకా బలపడ్డాయి. సోవియటుయూనియన్ శ్రామికవర్గం ధనికవర్గాల దోపిడీవిధానానికి శాశ్వతంగా స్వస్తి చెప్పడమే కాక, తమనెదిరించిన శత్రురాజ్యాల నన్నిటినీ ఓడించి తమ స్వాతంత్ర్యం నిలబెట్టుకున్నారు. బహిరంగ పోరాటాల్లో పరాజితులై సోవియటు శత్రువులు నిరాశులు కాలేదు. సోషలిస్టు ప్రభుత్వంమీద కుట్రలుపన్నీ, విద్రోహాలు పురిగొల్పీ, సోవియటు ప్రభుత్వయంత్రంలో దూరి శ్రామికులకు వ్యతిరేకంగా పనిచేసీ, సోవియట్ ప్రభుత్వాన్ని కూలద్రోయు ప్రయత్నాలు సాగించేరు.

అంతర్యుద్ధం, రహస్యవిద్రోహాలూ జరిగే రోజుల్లో అమూల్యత్యాగాలనుచేసి, విప్లవం ద్వారా తమ స్వాతంత్ర్యం సంపాదించుకున్న శ్రామికులకూ, యింకా తమ వెనుకటి అనర్హాధికారాలను పునరుద్ధరించాలనే స్వార్థబుద్ధితో విప్లవ విద్రోహకార్యాలు సాగిస్తూన్న ధనికవర్గానికీ మధ్య సమానత్వం ప్రభుత్వదృష్టిలో వుండడానికి అవకాశంలేదు. ఆకారణం చేతనే 1936 కు పూర్వం ధనికవర్గం వారికీ, వారి నిరంకుశత్వానికి సహాయులైన జారిస్టుపోలీసు, గూఢచారి దళాల్లో పనిచేసిన వారికీ ఓటింగు హక్కియబడలేదు. అట్లు తాత్కాలికంగా కొన్ని తరగతుల ప్రజల హక్కులపై నిర్బంధాలు విధించినా కమ్యూనిస్టుపార్టీ

గాని, సోవియటు ప్రభుత్వంగాని వాటిని శాశ్వతంగా వుంచాలని యెన్నడూ తలపెట్టి యుండలేదు.

1919 లోనే లెనిన్ "త్వరలోనే విదేశీయ సైన్యాలను పారద్రోలి, ధనికవర్గాల అధికారాన్ని కూలద్రోయడం పూర్తికాగానే కలిగే పరిస్థితుల్లో, శ్రామికవర్గ ప్రభుత్వం ప్రజలందరకూ సమానవోటింగు హక్కు లిస్తూనే, యీవిప్లవ ప్రతికూలుర నణచుటకు వేరే యితర విధానా లవలంబించవలసి రావచ్చు" అని గట్టిగా చెప్పేడు.

సోవియటు ప్రభుత్వాన్ని విమర్శించేవాళ్లు, సోవియటు ప్రభుత్వం బహుకొద్దిమందికి వోటింగుహక్కు తీసివేసినప్పటికీ యింతకుముందు యేరాజకీయ హక్కులనూ అనుభవించియెరుగని అసంఖ్యాక ప్రజా సామాన్యానికి ప్రభుత్వంలో పాల్గొనే హక్కులను, అవకాశాలను యిచ్చిందని గుర్తుంచుకోవాలి.

అదే విధంగా ప్రాతినిధ్యం విషయంలో రైతులకూ కూలీలకూ మధ్యనున్న తేడాలుకూడా తాత్కాలికములే. (పట్టణ నియోజకవర్గాల నుండి ప్రతి 25 వేలమందికి ఒక ప్రతినిధి; పల్లెల్లో ప్రతి 125 వేల మందికి ఒక ప్రతినిధి) కార్మికులు రైతుసామాన్యం కంటె యెక్కువ రాజకీయచైతన్యమూ, తమ ఆదర్శసిద్ధి కొరకెట్టి త్యాగాలకైనా తయారయే ధైర్యసాహసాలూ కలిగియుండి శిక్షణ, ఐక్యత కల ఒక వర్గంగా వుండడం వలన సోవియటు ప్రభుత్వస్థాపనలో వారికే ప్రాధాన్యత యివ్వబడింది. ఆశ్రామికవర్గ నాయకత్వం క్రింద రైతులు, చిన్న భూస్వాములు సోషలిస్టు విధానంలోని కొచ్చి, సమిష్టిక్షేత్ర నిర్మాణం జయప్రదం గావించేరు.

ప్రజల హక్కులకోసం జరిపిన పోరాటాల ద్వారా శ్రామికవర్గం రాజ్యాంగ వ్యవహారనిర్వహణం నేర్చుకుంది. శత్రువుల నెదిర్చి చేసిన స్వసంరక్షణ పోరాటాల్లో కూలీ-రైతుల మధ్య ఐకమత్యం బలపడింది

సోషలిస్టు సమాజనిర్మాణంలో కల్గిన అఖండవిజయాలు ప్రజల అనవసర భయాలను, అనుమానాలను పోగొట్టి శ్రామికులవైపుకు, సోవియటు ప్రభుత్వంవైపుకు ఆకర్షించేయి.

ప్రజలకు తగిన శిక్షణ యిచ్చి ఆర్థిక రాజకీయ వ్యవహార నిర్వహణదక్షులుగా చేయడం సోవియటు ప్రభుత్వపు కార్యక్రమంలో ప్రథమ స్థానం వహించింది. సోషలిస్టు సమాజనిర్మాణం, ప్రజాసేవ, యివే పహదాశయంగా గల ఒకకొత్త విద్యాధిక వర్గం కూలీరైతు వర్గాల నుండి బయల్దేరింది.

వివిధజాతుల ప్రజలతో నిండియున్న సోవియటు యూనియను ప్రపంచచరిత్రలో అపూర్వమైన అభివృద్ధిని అతి త్వరితకాలంలో పొందగల్గిందీ అంటే దానికి మూలకారణం రాజ్యాంగయంత్రానికీ ప్రజాసామాన్యానికీ మధ్య వున్న అతి సన్నిహితసంబంధమే. సోవియటు యూనియన్‌లో సోషలిస్టు ఆర్థికవిధానం పూర్తిగా అమల్లోవుంది. దేశంలోని భూమి, రైల్వేలు, గనులు, ఫాక్టరీలు, పరిశ్రమలు—అన్నీ ప్రజలందరికీ చెందిన సమిష్టిఆస్తి. స్టాలినిస్టు పంచవర్ష ప్రణాళికలు జాతీయ సంపద నెన్నోరెట్లెక్కువ చేసేయి. మానవుని దోపిడీ విధానం తొలగించబడింది. సోషలిస్టు ఆర్థికవిధాన సత్వరాభివృద్ధితోబాటు ప్రజాసామాన్యం యొక్క భౌతికసంపద, విద్యావిజ్ఞానాలు ముందడుగు వేస్తున్నాయి.

తమ శ్రమఫలితం తమ సౌఖ్యాభివృద్ధికే యని గుర్తించి సోవియటు ప్రజలు అత్యుత్సాహంతో సోషలిస్టు పోటీతో 'స్టాఖనోవు' వుద్యమంలో పాల్గొంటున్నారు. ఈవుద్యమాశయం శ్రామికుని వుత్పత్తి శక్తిని యెక్కువ చేయుటయే.

1936 లో నూతన రాజ్యాంగచట్టం అమల్లో కొచ్చింది. వోటింగు నిబంధనలన్నీ సడలించబడ్డాయి. ధనికవర్గాల నాశనం, శ్రామికవర్గాల

చైతన్యం, ప్రభుత్వబలాధిక్యత—వీటివలన వెనుకటి నిబంధన లనవసరం అయేయి. సోషలిస్టు సమాజ నిర్మాణవిజయచిహ్నాం యీనూత్న రాజ్యాంగచట్టం.

ఈనూతన రాజ్యాంగాన్ని ప్రజాసామాన్యం ఆమోదించుటే ఒక ఆదర్శప్రాయమైన ప్రజాస్వామ్యపద్ధతిని జరిగింది. ఆబిల్లు ముందుగా దేశంలోని వివిధవర్గాల ప్రజలచేత కూలంకషంగా చర్చింపబడింది. ఆచర్చలలో వెల్లడియైన ప్రజల అభీష్టాలన్నీకూడా ఆచట్టంలో చేర్చబడినై.

ఈనూతన రాజ్యాంగచట్టంక్రింద యూనియన్. రిపబ్లిక్ సోవియట్లకు (కేంద్ర, రాష్ట్రీయ శాసనసభలకు) జరిగిన యెన్నికల్లో సోవియట్ ప్రజాతంత్రం యొక్క విశిష్టత స్పష్టమైంది.

శ్రామికుల వివిధసంస్థలద్వారా నామినేషన్లు జరిగేయి. అభ్యర్థుల మంచిచెడ్డలను చర్చించడానికి వందలకొలది మీటింగులు జరిగేయి. ప్రతి ఫాక్టరీలో, ప్రతి సమిష్టిక్షేత్రంలో, ప్రతి అభ్యర్థి సోషలిస్టు నిర్మాణ కార్యక్రమంలో పాల్గొని చేసిన ప్రజాసేవయే ప్రజల కతనిపై గల విశ్వాసానికి కొలబద్దగా తీసికోబడింది. సోవియటు యూనియనులో 18 సం॥ దాటిన ప్రతి స్త్రీకీ, పురుషునికీ వోటుంది. ఆస్తితో, చదువుతో జాతిమతాలతో సంబంధించిన నిబంధనలేవీ లేవు. పిచ్చివాళ్ళకూ న్యాయస్థానాల్లో శిక్షితులై ఓటు తీసివేయబడినవారికీ మాత్రం వోటుండదు. ఒక పౌరునికి ఒకే వోటుంటుంది. రహస్య ఓటింగ్ పద్ధతినే యెన్నికలు జరుగుతాయి. సోవియటు యెన్నికలన్నీ ప్రత్యక్షయెన్నికలే. ప్రతినిధికీ, అతని నియోజకవర్గంలోని వోటర్లకు గల సంబంధంకూడ సోవియటు ప్రజాతంత్రంలో ఒక విశిష్టలక్షణం. సోవియటు రాజ్యాంగాన్ని బలపరచేవీ, సోషలిజాన్ని అభివృద్ధిచేసేవీ అయిన శాసనాలను చేయడం ప్రతినిధియొక్క కర్తవ్యం. అత డెప్పుడైతే తన దేశ

యెడల, ప్రజలయెడల కర్తవ్యనిర్వహణ సరిగా చేయడం లేదని ప్రజలకు ఋజువైందో అప్పుడే అతడిని సభ్యత్వంనుండి తొలగించే అధికారం ప్రజలకు యివ్వబడింది. సోవియటు ప్రజలందరూ తమ జాతి భేదాలను మరచి అత్యుత్సాహంతో సోషలిస్టు సమాజనిర్మాణంలో ప్రభుత్వాని కండదయై నిలచేరని యీ యెన్నికల ఫలితాలనుబట్టి తెల్లమైంది.

మాతృభాషలో స్టడీసర్కిల్సు, వుపన్యాసాలద్వారా ప్రతిపౌరునికీ ఎలక్షన్లలోవున్న హక్కులూ, విధులూ విపులంగా బోధింపబడినై. బాలట్ పేపర్లుకూడా వివిధప్రాంతాల మాతృభాషల్లోనే ముద్రింపబడినై. ఈ కారణాలచే ప్రజాసామాన్యంఅంతా వుత్సాహంతో యెన్నికల్లోపాల్గొనే అవకాశం కలిగింది. ఎన్నికల్లో అల్లర్లు, అన్యాయాలు జరుగకుండా చూడ్డానికిగాను వివిధ ప్రజాసంస్థలు పదిలక్షలుపైగా తమ ప్రతినిధులను పంపేయి. 1937 డిసెంబరు 12 వ తేదీన యెన్నికలు జరిగేయి. 9,11,13,153 వోటర్లు. మొత్తం వోటర్లలో 96·8%-తమ వోట్లనిచ్చేరు. ట్రేడ్‌యూనియను మొదలైన నాన్‌పార్టీ సంస్థలతో కమ్యూనిస్టుపార్టీ ఒక బ్లాక్‌గాయేర్పడి సంయుక్తంగా అభ్యర్థున్ని నిలబెట్టేరు. కేంద్ర శాసనసభ యెన్నికల్లో 8,98,44,271 వోటర్లు (అంటే 98·6%) సంయుక్తపార్టీ అభ్యర్థుల తరపునే వోటుచేసేరు. సోవియట్ ఆఫ్ నేషనాలిటీస్ యెన్నికల్లో 97·8%; వివిధ రిపబ్లిక్ సోవియట్ల యెన్నికల్లో 99·4% వోట్లు సంయుక్తపార్టీ అభ్యర్థులకే వొచ్చేయి.

ఆర్థిక అసమానత్వాన్ని తొలగించి పౌరులు తమ హక్కులను పూర్తిగా వుపయోగించుకునేందుకు తగిన అవకాశాలను కల్పించింది, సోవియట్ ప్రజాస్వామ్యం. ప్రజల్లో గొప్ప చైతన్యాన్ని కల్గించింది. పెట్టుబడిదారీదేశాల్లో ప్రజలహక్కులు నామమాత్రమే. ఉత్పత్తిసాధనాలు సంఘపరంచేయబడి దారిద్ర్యం, నిరుద్యోగం నిర్మూలింపబడిననాడే ఆ

హక్కులు సార్థకం అవుతాయి. అట్టి పరిస్థితులు యొక్క సోవియట్ ప్రజా తంత్రంలోనే వున్నాయి.

కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లు, ఆకలితో మాడుతూ, నిరుద్యోగంలో కొట్లాడుతూ, కడుపు చేతబట్టుకు తిరిగే దరిద్రునికి వ్యక్తిస్వాతంత్ర్యం యెంత నిరుపయోగమో వేరే చెప్పనక్కరలేదు. దరిద్రం, నిరుద్యోగం, దోపిడీవిధానం నశించిననాడే మానవుడు నిజమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాల ననుభవించగలడు. లేనినాడు, వుందేహక్కులు జీవితానుభవం లోనికిరాని వుత్తుత్తి కాగితపు హక్కులే. అటువంటి నిజమైన స్వేచ్ఛా వాతావరణంతోకూడిన సమాజం ఒక సోవియట్ యూనియన్‌లోమాత్రం స్థాపింపబడింది.

1936 నూతనరాజ్యాంగచట్టంలో యీ క్రిందిహక్కులు స్పష్టంగా నిర్వచించబడినాయి :

"ప్రతి పౌరునికీ పనిచేసే హక్కువుంది. ఆర్థికవ్యవస్థను సమాజ పరంచేసి, జాతీయసంపద నెన్నోరెట్లు యెక్కువచేసి, నిరుద్యోగాన్ని తొలగించడంవలన యీహక్కు రక్షింపబడుతూంది." (118 సూత్రం.)

సోవియటు యూనియన్‌లో ఉత్సాహం, తెలివితేటలు వున్న ప్రతివానికీ అభివృద్ధి కెన్నోమార్గాలున్నాయి. 'స్టాఖనోవు' కార్మికులు పనిలో శాస్త్రీయవిజ్ఞానాన్ని పూర్తిగావినియోగించి వుత్పత్తినెంతో యెక్కువచేస్తున్నారు. శ్రామికులకు శాస్త్రంలో, టెక్నిక్‌లో శిక్షణపొందే అవకాశాలెన్నోవున్నై. సోవియట్ కార్మికులు ఆ అవకాశాలను పూర్తిగా వుపయోగించుకొని తమ సంఘానికీ, తమ ఆశయసిద్ధికీ అమూల్యసేవ జేస్తున్నారు.

"రోజులో పనిచేయుకాలాన్ని 7 గంటలకు తగ్గించి, పూర్తి జీతంతో ప్రతియేటా శెలవులిచ్చి, శ్రామికులకొరకు అనేక ఆరోగ్య సదనములు, క్లబ్బులుకట్టించి వారికి తమ 'విశ్రాంతి తీసికొనే హక్కు'

నుపయోగించుకునే అవకాశాలను కలగజేస్తూంది. వారి విద్యాజ్ఞానాల అభివృద్ధికికూడ వలసిన పరిస్థితులు కల్పించబడినై." (119 సూత్రం.)

"ముసలితనంలో, జబ్బుచేసినపుడు, అశక్తతపైబడినపుడు ప్రభుత్రమే వారిని పోషిస్తుంది." (120 సూత్రం.)

ఉచిత విద్యావిధానం, ఉన్నతవిద్యలో వుపకారవేతనాలు యివ్వబడతాయి. (121 సూత్రం.)

వివిధజాతుల భాషల్ని అభివృద్ధిచేసి వాటిద్వారా సోషలిస్టు సంస్కృతిని ప్రజాసామాన్యంకి అందుబాటులోకి తెచ్చేరు.

అన్నిరంగాలలో స్త్రీలకు పురుషులతో సమానహక్కు లీయబడినై. "జాతిభేదాలు కారణంగా ఎవరికీ ప్రత్యేకహక్కు లుండరాదు. జాతి వైషమ్యాలను ప్రచారంచేయడం శిక్షార్హం." (123 సూత్రం.)

పీడితులై, అధోగతిలోవున్న అనేకజాతులకు సమానహక్కుల నిచ్చి వారి ఆర్థికస్థితినీ, విజ్ఞానాన్నీ పెంపొందించి, వారిలో ఒక నూతన చైతన్యాన్ని కల్గించింది.

సోషలిస్టు ప్రజాస్వామ్యం మానవుణ్ణి వున్నతస్థితికి తెచ్చింది; వర్గ, జాతి నిరంకుశత్వాలను నిర్మూలించింది. జాతి, మత భేదాలను మరచి ప్రతి సోవియట్ పురుషుడూ, స్త్రీ భుజంభుజంకల్పి సోదరభావంతో తమ ఆశయందెసకు సాగిపోతున్నారు. తమదేశానికి అధికారులు, తమ యొక్క, తమ బిడ్డలయొక్క భావిభాగ్యనిర్మాతలు తామేయనే అచంచల విశ్వాసంతో వారు తమకర్తవ్యనిర్వహణ గావిస్తున్నారు. ప్రజలలో రాజకీయ నైతిక ఐక్యతను నెలకొల్పి వారిని జయప్రదంగా కమ్యూనిష్టు సమాజస్థాపన అనే అంతిమాశయందెసకు త్వరితగతిని నడిపిస్తూన్నది, సోవియట్ ప్రజాతంత్రం.

# మైనారిటీ జాతులు.

విశాల సోవియటుభూమిలో రష్యన్లు, యూక్రేనియన్లు, జార్జియన్లు, ఆర్మీనియన్లు, టర్కులు, తాఝిక్‌లు, యూదులు, గ్రీకులు మొదలైన యెన్నో (200 పైగా) జాతుల ప్రజలు నివశిస్తున్నారు.

జారుప్రభుత్వం గ్రేట్‌రష్యన్లనుమాత్రమే అభిమానదృష్టితోచూసి, మిగిలిన జాతులన్నిటినీ విదేశీయులుగా పరిగణించింది. ఆ రష్యన్లలో కూడా అధికసంఖ్యాకులైన కూలీ రైతులకు యెట్టి రాజకీయహక్కులు గాని జీవనసౌకర్యాలుగాని లేనేలేవు. పైగా రష్యన్ ధనికవర్గం, భూస్వాములు యీ బీదప్రజలను ఆర్థికంగా భయంకర దోపిడీవిధానానికి బలి గావించింది.

జారుప్రభుత్వం వివిధజాతులమధ్య పరస్పర విద్వేషాలను రగుల్కొల్పింది. తిన తిండి, కట్ట బట్టాలేని ప్రజల జీవితాలను యీనిరంతర జాతికలహాలూ, హత్యలూ దుర్భరంగా చేసేయి.

అమాయకులైన ఉత్తరప్రాంత ప్రజలను రష్యన్ వర్తకులు మోసంచేసి తమ చిన్నసరకులనిచ్చి వారివద్ద చాలవిలువైన వస్తువులను సంగ్రహించేవారు. ఆ అనాగరకులకు తమవస్తువుల విలువా తెలియదు; తమకీయబడే సరకులవిలువా తెలియదు. ఒక కుట్టుసూది తీసికొని ఒక దుప్పి నిచ్చేవారు; ఒక వోడ్కా-సీసాకు సేబిల్ (ఉడుములాంటిజంతువు) చర్మం యిచ్చేవారు.

కాకసస్‌పర్వతప్రాంతీయులు, కిర్గిజ్‌లు మొదలైన మధ్యఆశియా జాతులు బానిసత్వంనుండి యెంతకూ విముక్తిపొందలేక నిరాశులై తమ ఫలవంతములైన భూముల్ని రష్యన్‌భూస్వాములకు వొదలివేసి పర్వతాలలోకి వెళ్ళిపోయేరు. ప్రజలలో ప్రజ్వరిల్లుతున్న అశాంతి, స్వాతంత్ర్య పిపాసలను జారుప్రభుత్వం తనమీదికిరాకుండా మారుద్రోవలను పట్టిం

చింది. జాతికీ జాతికీ మధ్య భయంకర విద్వేషాలను ప్రేరేపించేది. రష్యన్లను యూదులమీదికి, జార్జియన్లను ఆర్మీనియన్లమీదికి యిలాగ ఒక జాతిని మరోజాతిమీదికి పురిగొల్పేది.

యూదులమీదకు రౌడీలను పురిగొల్పి దోపిడీలు, హత్యలూ చేయించడం ప్రభుత్వానికో క్రీడ. ప్రభుత్వ ప్రోద్బలంమీద కాకసస్‌లోని 'షూషా' పట్టణం దగ్ధంచేసివేసి, అందులోని 20 వేల ప్రజలు దారుణంగా హత్యచేయబడ్డారు. ఇటువంటి సంఘటన లెన్నోజరిగేవి.

ఎక్కడైనా ప్రభుత్వంపై తిరుగుబాటుజరిగే సూచనలు కన్పించగానే పరస్పర జాతికలహాలను, పోగ్రోమ్సును (ఆస్తిని నాశనంచేసీ, హత్యలుచేసీ అమానుషకృత్యాలుచేసే దాడి. ముఖ్యంగా యూదులపై జరుపబడేవి.) పురిగొల్పేది. ప్రజలకు ప్రభుత్వంపైవున్న ద్వేషాగ్ని యితరజాతులమీదకు మళ్ళింపబడేది. ఒకజాతి దరిద్రానికీ, దుస్థితికీ నెపం యింకోజాతిపై వేయబడేది. ఒకజాతి శ్రామికులు మరోజాతి శ్రామికులతో పోరాటాలు సాగించేవారు. అంటే శ్రమజీవులంతా ఏకమై తమ అందరి అభాగ్యస్థితికీ మూలకారణమైన జారు నిరంకుశత్వాన్ని కూలద్రోసే అవకాశంలేకుండా చేయబడిందన్నమాట.

యూదులు, ఉజ్బెక్కులు యింకా అనేక యితరజాతులవారు ప్రభుత్వోద్యోగాల కనర్హులుగా ప్రకటింపబడేవారు. జారుప్రభుత్వం యూదులయెడల చూపించిన క్రూరత్వం నేటి నాజీహంతకులు యూదులనుపెట్టే దారుణహింసల కేమాత్రం తీసిపోదు.

మధ్య రష్యాలో, మాస్కోలో, పీటర్సుబర్గులో యింకా యితర పట్టణాల్లో యూదు లసలు నివశింపనేరాదు. ఇతరచోట్లకూడా వారు మామూలు ప్రజలతోకలసి కాక వేరే వూరివెలుపల 'సెటిల్‌మెంట్సు'లో వుండాలి. వారు వ్యవసాయవృత్తి చేయరాదు. విద్యాలయాల్లో ఒక నిర్ణీత

సంఖ్య యూదుల్నిమాత్రమే చేర్చుకొనేవారు. యూదువిద్యార్థుల సంఖ్య మాస్కో, పీటర్సుబర్గు పట్టణాలలో 100 కి మూడూ, యితరచోట్ల 100 కి ఐదూ దాటరాదని నియమం చేయబడింది.

ప్రజలను ఒకప్రక్క నిరంకుశప్రభుత్వం, మరోవేపు భూస్వాములూ, మతాధికారులూ పీల్చి పిప్పిచేసి నానాహింసలూ పెట్టేవారు.

జారిస్టుప్రభుత్వం ప్రజలను మూర్ఖత్వంలో, అజ్ఞానంలో ఉంచడం ఒక 'పోలసీ'గా అవలంబించింది. కిర్ఘీజియాలో వెయ్యికి ఆరుగురు మాత్రమే అక్షరాస్యులు. అనేక రాష్ట్రాల్లో ఒక్క కాలేజీ వైనాలేదు. ఎలిమెంటరీ స్కూల్సుకూడా బహుతక్కువ. ఒక్క రష్యన్‌భాషలో తప్ప మిగతాభాషల్లో విద్యాబోధన నిషేధింపబడింది. గ్రంథప్రచురణ అసలే లేదు. వారి మానసికాభివృద్ధి పూర్తిగా అరికట్టబడింది. యూక్రేనియన్లు, జార్జియన్లు మొదలగువారి జాతీయసంస్కృతులు, కళలు పూర్తిగా నిరాదరింపబడినై. జార్జియాలో జాతీయగీతాలను పాడితే శిక్షించేవారు. మొత్తంమీద రష్యన్‌భాషను, విజ్ఞానాన్ని యితరజాతులపై రుద్దడమనే విధానం పూర్తిగా అనుసరింపబడింది.

జారు నిరంకుశత్వాన్ని కూలద్రోసి ప్రజాస్వామ్యాన్ని స్థాపించిన అక్టోబర్ విప్లవం జాతీయవిభేదాలను, నిర్బంధాలనుకూడ నిర్మూలించింది. ప్రతిజాతికీ స్వయంనిర్ణయాధికారం, సమానహక్కులూ యివ్వబడినై.

సోవియటు ప్రభుత్వం జాతీయమైనారిటీలయెడల నవలంబించిన పోలసీ 'రష్యన్‌ప్రజల హక్కులపత్రం' (1917, నవంబరు 15) లో వివరింపబడింది. అందలి ప్రధానసూత్రాలు :

1. రష్యాలోని ప్రజలందరూ సమానులు — రాజ్యాంగాధికారం ప్రజలదే.
2. వివిధజాతులకు స్వయంనిర్ణయాధికారంవుంది — అవసరమైతే సోవియటు యూనియనునుండి విడిపోయేహక్కుతోకూడా.

3. వివిధజాతులపైవున్న నిర్బంధాలు తొలగించడం — ఏజాతికీ యెక్కువ అధికారాలు, హక్కులు లేకుండచేయడం.

4. మైనారిటీలకు తమ జాతీయజీవనాన్ని, విజ్ఞానాభివృద్ధి చేసికొనేందుకు అవకాశాలు యివ్వబడతాయి.

తామందరూ యేకమైననాడే ధనికవర్గ నిరంకుశత్వాన్నికూలద్రోసి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను పొందడం సాధ్యమౌతుందని అన్నిజాతుల ప్రజలకు సువ్యక్తంచేసిందీ హక్కులపత్రం.

సోవియటు యూనియనులోని అన్నిజాతులూ ఐక్యతాబలంతో నిలబడ్డంచేతనే విదేశసైన్యాలను, విప్లవ ప్రతికూలురను ఓడించి తమ స్వాతంత్ర్యం, స్వేచ్ఛా సంపాదించుకోగలిగేరనే అమూల్యమైన పాఠం, వివిధజాతుల ప్రజలమనస్సులకు పట్టింది. అందరూ ఐక్యతావసరాన్ని గుర్తించేరు.

అంతర్యుద్ధం, విదేశీయుల దండయాత్రలు పూర్తిగా ఓడింపబడినాక 1922 లో అఖిల యూనియన్ సోవియట్ కాంగ్రెసు మాస్కోలో సమావేశమై, వివిధజాతీయ రిపబ్లికులను ఒకే సమాఖ్యగా "సోవియటు యూనియను" అనే పేరుతో నిర్మించుటకు తీర్మానించింది. యూనియనులోని రిపబ్లిక్కు లన్నిటికీ విడిపోయేహక్కుకూడా వుంటుందని స్పష్టంగా ప్రకటించబడింది,

ఆర్థిక దుస్థితినుండి కోలుకోవడానికిన్నీ, తమందరికూ శత్రువులైన సామ్రాజ్యవాదదేశాల భావిదురాక్రమణ నెదుర్చుటకున్ను తామంతా ఒకే సంయుక్తరాజ్యాంగం నిర్మించుకొనుట అవసరమని గుర్తించి, వివిధ రిపబ్లిక్కులు గబగబా యూనియనులో చేరేయి.

సోవియటు యూనియను అన్నిజాతులకూ సమానహక్కు లిచ్చిందికాని, వారందరూ తమహక్కుల నుపయోగించుకునేందుకు

సమానస్థితిలోలేరు. ఆర్థికంగా, వైజ్ఞానికంగా ఒకజాతికీ యింకోజాతికీ మధ్య యెంతోతేడా. మొత్తానికన్నీ వెనుకబడి దౌర్భాగ్యస్థితిలోనే వున్నాయి. అందుచే ముందు యీ ఆర్థిక వైజ్ఞానిక అసమానత్వాన్ని తొలగించి అన్నిజాతులనూ ఒకే అభివృద్ధిదశలోనికి తెచ్చుటకు సోవియటు ప్రభుత్వం తలపెట్టింది. కమ్యూనిష్టుపార్టీ నాయకత్వంక్రింద రష్యన్ విజ్ఞానం, రష్యన్ శ్రామికవర్గం మిగిలినజాతుల అభివృద్ధి కార్యంలో చాలా సహాయం, కృషి చేసినై.

రాజకీయ బానిసత్వం, ఆర్థిక దోపిడీవిధానం తొలగింపబడ్డంతో జాతులమధ్య పరస్పర ద్వేషకారణాలుకూడా నిర్మూలింపబడినై.

దాఘేస్తాన్ కవి సులేమాన్ స్టాక్‌స్కీ అన్నట్లు: "ప్రపంచాన్ని వూపివేసిన బోల్షివిక్ విప్లవం రష్యన్‌ప్రజల పాత దౌర్భాగ్యజీవిత విధానాలను కూకటివ్రేళ్ళతో పెల్లగించిపారేసింది. ఆ మహావిప్లవం వెలిగించిన అమరజ్యోతియొక్క తేజోకిరణాలు దేశం నలుమూలలకూ ప్రసరించేయి" ఈ యిరవై యేళ్ళలోనే అనేకజాతులు శుద్ధ అనాగరకస్థితి నుండి నవీననాగరక స్థితికి వచ్చినై. సోవియట్ విజ్ఞానం ప్రజల్లో ఒక నూతనజీవితాన్ని, వుత్సాహాన్ని కల్గించింది."

వివిధ రిపబ్లిక్కులన్నీ చాలత్వరత్వరగా అభివృద్ధి చెందుతున్నై. వాని సంపత్తిఅంతా పూర్తిగా వినియోగంలోకి తేబడుతూంది. యెన్నో కొత్తగనులు కనిపెట్టి వివిధలోహాలవుత్పత్తి నధికంచేస్తున్నారు. అనిజోత్పత్తితోబాటు కొత్తపరిశ్రమలు, ఫాక్టరీల సంఖ్యకూడా అద్భుతంగా పెరుగుతూంది. కజాక్‌స్థాన్‌లోని బొగ్గు, రాగి, సీసం—ట్రాన్స్ కకేషియాలో మాంగనీసు— కిర్ఘిజియాలో బొగ్గు— ఒస్సెషియాలో తగరం— బష్కిరియాలోనూ, యూరల్స్‌లోనూ నూనెగనులు— వీటియాధారంతో ఆ యా రిపబ్లిక్కులలో అనేక కొత్తపరిశ్రమలు స్థాపింపబడినై.

జారుప్రభుత్వ కాలంలో కజాక్‌స్థాన్‌లోని ఖనిజసంపద శుద్ధ అనుపయోగంగా వుంచేరు. అక్కడ ఒక రైల్వేపైనుకూడ వేయబడ లేదు. సోవియట్ ప్రభుత్వంలో, 1928–32 మధ్య మొదటిసారిగా రైల్వే వేయబడింది కజాక్‌స్థాన్‌లో. టర్కిస్థాన్ సైబీరియాలనుకలిపే ఆ రైల్వేపడ్డంవలన అనేక పట్రభూములు చాల ప్రాముఖ్యంలోకివచ్చేయి. సోవియట్ ప్రభుత్వంక్రింద ఉజ్బెక్‌స్థాన్‌యొక్క ఆర్థికజీవనంలో ఒక అపూర్వమైన మార్పుకల్గింది. గొప్ప నీటిపారుదల స్కీములద్వారా లక్షలయెకరాల్లో ప్రత్తి పండిస్తున్నారు. పెద్దపెద్ద బట్టలమిల్లులు స్థాపింప బడినై. పూర్వం నూనెగనులకు సుప్రసిద్ధమైన 'బాకూ' ఒక్కటే అజర్‌బైజాన్‌లో పారిశ్రామిక కేంద్రం. ఆ నూనెపరిశ్రమకూడా యేదో కొద్దిమంది పెట్టుబడిదారుల లాభాలకేగాని ప్రజాసామాన్యానికేమీ వుపయోగించేదికాదు. సోవియటు అధికారంలో నూనెగనుల వుత్పత్తి మూడు రెట్లుపైగా పెరిగింది. అనేక కొత్తపరిశ్రమలు స్థాపింపబడ్డాయి. ప్రజాసామాన్యం సుఖజీవనం చేస్తున్నారు. కార్మికుల కనేకహక్కులీయ బడినాయి.

సోవియటు యూనియనులోని అన్నిరిపబ్లిక్కులలోనూ అద్భుతమైన ఆర్థికాభివృద్ధి కనిపిస్తూంది. 1913 లో జారిస్టురష్యాలో అన్ని రైలు స్టేషన్లలోకలిపి జరిగిన యెగుమతి దిగుమతులకంటె నేడు ఒక్క యుక్రేను స్టేషన్లలో యెక్కువ జరుగుతున్నాయి.

పరిశ్రమలతోబాటు వ్యవసాయంకూడా చాలా అభివృద్ధి చెందుతూంది. నూతన వ్యవసాయపద్ధతులు, యంత్రాలు, సమిష్టి వ్యవసాయ పద్ధతి—వీటిమూలంగా భూమియొక్క వుత్పత్తి యెన్నోరెట్లు యెక్కువయింది వ్యవసాయంలో, శాస్త్రీయవిజ్ఞానం, యంత్రాలు పూర్తిగా వుపయోగింపబడుతున్నై. కర్రనాగళ్ళుతప్ప చూసియుండని కొండ కోనల్లోకూడా వ్యవసాయ యంత్రాలు కనబడుతున్నాయి. ఒక్క

యుక్రేన్‌లో 88,000 ట్రాక్టర్లు; 27,000 హార్వెస్టరు 'కంబైన్సు' (కోసి, నూర్చే యంత్రాలు) వున్నాయి. బైలోరష్యా సమిష్టిక్షేత్రాల ఆధీనంలో 8,100 ట్రాక్టర్లు; 4,000 ట్రక్కులు, అనేక యితరయంత్రాలు వున్నాయి. కిర్ఘిజియాలో 3,964 ట్రాక్టర్లూ— టార్టారియాలో 6,885 ట్రాక్టర్లు; 2,871 హార్వెస్టర్ కంబైన్సు—అజర్‌బైజాన్‌లో 5,562 ట్రాక్టర్లు— వుపయోగింపబడుతున్నాయి.

అనేక కొత్తపైరులు వేయబడుతున్నాయి. యుక్రేనులో పత్తి, ట్రాన్స్ కకేషియాలో తేయాకు బాగా పండుతూంది. కకేషియాలో నిమ్మ జాతి తోటలు విస్తారంగా పెంచుతున్నారు. పశుజాతుల్ని అభివృద్ధి చేస్తున్నారు.

ఈ పారిశ్రామిక, వ్యవసాయాభివృద్ధులవలన వేలకొలది పనివాళ్లు కూడా అవసరమౌతున్నారు వివిధపరిశ్రమల్లో పనిచేయడానికి. ప్రజా సామాన్యంలోనుంచే మంచి శిక్షణపొంది, ప్రవీణులైన పనివాళ్లెందరో తయారయేరు, యీ ఇరవై సంవత్సరాల సోవియటు పరిపాలనలో.

కొన్ని అనాగరకజాతుల దురాచారాలను మాన్పుట చాలా కష్ట సాధ్యమైంది. ముఖ్యంగా ఆడవాళ్ళవిషయంలో— పెళ్ళియీడువచ్చిన పిల్లను, ఆమె యిష్టానిష్టాలతో పనిలేకుండా- యెక్కువధనం యెవడి స్తే వాడికి కట్టబెట్టేవారు. స్త్రీల కెటువంటి స్వేచ్ఛాలేదు. స్త్రీ ముఖం పురుషుడి కంటబడరాదు. అందుకోసం స్త్రీలకు ముసుగులు వేసేవారు. బైటి ప్రపంచంతో స్త్రీలకు సంబంధమేలేదు. తూర్పుప్రాంత ప్రజల్లోకూడ స్త్రీ బానిసగా చూడబడేది. ఆమె భర్తకో, తండ్రికో, అన్నకో లొంగియుండ వలసిందే. దాఘేస్థాన్‌లో ఒక సామెతవుంది: "ఆ పనైనా చెయ్యలేక పోతే నువ్వు శుద్ధ ఆడదానివన్నమాట." ఆడదంటే అంత యెందుకూ కొరగానిదిగా పరిగణించేవారు.

సోవియటు ప్రభుత్వం స్త్రీల నీచానిసత్వంనుండి లేవనెత్తి, వారికి పురుషులతో సమానహక్కుల నిచ్చింది. ప్రభుత్వాదరణ, సహాయాలతో వేలకొలది స్త్రీలు చదువుకొని డాక్టర్లు, రాజకీయవేత్తలు, అధ్యాపకులు, ఇంజనీర్లుగా సంఘసేవ చేస్తున్నారు.

విజ్ఞానాభివృద్ధిలో వెనుకబడియున్న జాతుల నుద్ధరించడానికి ప్రభుత్వం మొదటినుండీ యెంతో శ్రద్ధవహించింది.

ప్రాథమికవిద్య దేశంఅంతటా నిర్బంధంచేయబడింది. స్కూలు పిల్లలసంఖ్య కొన్ని రిపబ్లిక్కులో 40 రెట్లు, కొన్ని రిపబ్లిక్కులో 100 రెట్లుపైగా యెక్కువైంది. (కిర్ఘిజియాలో 172 రెట్లు.) 1936 నాటికి సోవియటు యూనియనులో మొత్తం 112 భాషల్లో విద్య నేర్పబడుతూంది. పూర్వం యూనివర్శిటీ, కాలేజీలంటే తెలియని అనేక రిపబ్లిక్కులో యిప్పుడు యెన్నో కాలేజీలు స్థాపింపబడినై. యూక్రేనులో వున్నత విద్యాలయాలసంఖ్య 15 నుండి 189 వరకూ పెరిగింది. జర్మనీ, బ్రిటన్, ఇటలీల్లో కలిపి యెంతమంది విద్యార్థులున్నారో అంతకు మూడురెట్లుపైగా ఒక్క రష్యన్ రిపబ్లిక్కు వున్నత విద్యాలయాలలో వున్నారు.

సోవియటు ప్రభుత్వం జాతీయ సంస్కృతికీ, జాతీయ కళలకు చాల ప్రోత్సాహం యిచ్చింది. ఉద్గ్రంథాలన్నీ— ఏభాషలోనివైనాసరే— మిగతాభాష లన్నిటిలోకీ అనువదింపబడి ప్రపంచ సాహిత్యం అంతా ప్రజాసామాన్యానికి అందుబాటులోకి తేబడింది. వివిధ జాతీయ విజ్ఞానాల్లోని పుత్కృష్టత సోవియటుప్రజ లందరిసొత్తుగా చేయబడింది. రష్యన్ విజ్ఞానం, ప్రపంచసంస్కృతీ, వివిధజాతుల విజ్ఞానంపై గొప్ప అభివృద్ధికరమైన మార్పుతెచ్చేయి. పుష్కిన్, డార్విన్, షేక్స్పియర్, సెర్వాంటిస్, టాల్‌స్టాయి, మార్క్సుల పుద్గ్రంథాలు వివిధభాషల్లో ప్రచురింప

బడినాయి. (భారతీయ ప్రాచీనవిజ్ఞానంలోని అమూల్యగ్రంథాలెన్నో రష్యన్ భాషల్లోకి అనువదించబడినాయి. భారత, రామాయణాలు; కాళిదాసు గ్రంథాలు, టాగోరు మొదలగు ఆధునికుల గ్రంథాలు ఎన్నో రష్యన్ భాషల్లోకి అనువదించబడినవి—అనువాదకుడు.)

సోవియటు యూనియనులోని అన్నిజాతులూ, ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానికవిషయా లన్నిటిలో సంపూర్తియైన హక్కుల్ని, సమానత్వాన్ని అనుభవిస్తున్నాయి.

"సోవియటు యూనియను పౌరులందరకూ— జాతి మతాలతో నిమిత్తంలేకుండా- ఆర్థిక, రాజకీయ, సాంఘికవిషయా లన్నిటిలోనూ అనన్యాక్రాంతములైన హక్కులున్నాయి." (123 సూత్రం.)

"జాతిభేదాలు కారణంగా యెవరిహక్కులనైన నిరోధించుటగాని లేదా ఒకజాతి తమ కెక్కువసౌకర్యాలను, హక్కులను ఆరోపించుకొనుటగాని, జాతిద్వేషాలను కలిగించే సిద్ధాంతాలను ప్రచారంచేయుటగాని కఠినశిక్షార్హములైన నేరములుగా పరిగణింపబడును."

ప్రతి నేషనల్ రిపబ్లిక్కు తన ప్రత్యేక పరిస్థితుల కనుగుణమైన సోషలిస్టు సిద్ధాంతాలకు వ్యతిరేకంకాని - రాజ్యాంగచట్ట నిర్మాణహక్కును కలిగియుంది. ప్రతి రిపబ్లిక్కుకూ సంపూర్ణమైన స్వయంనిర్ణయాధికారం యివ్వబడింది.

సోవియట్ యూనియన్‌లోని కేంద్రశాసనసభ (సుప్రీం సోవియటు) రెండుగా విభజింపబడింది. (*a*) అఖిలయూనియన్ సోవియట్ మహాసభ, (*b*) సోవియట్ ఆఫ్ నేషనాలిటీస్. శాసన నిర్మాణంలో యీ రెండు సభలకూ సమానాధికారాలున్నాయి. ఈ సోవియట్ ఆఫ్ నేషనాలిటీస్‌లో ప్రతి యూనియన్ రిపబ్లిక్కునుండి 25 గురు, ప్రతి ఆటానమస్ రిపబ్లిక్కునుండి 11 మంది, ప్రతి ఆటానమస్ రీజియనునుండి 5 గురు, ప్రతి నేషనల్ ఏరియానుండి 1, సభ్యులుగా యెన్నుకోబడతారు.

30 లక్షల జనాభాగల అజర్‌బైజాన్ రిపబ్లికూ, 3 కోట్ల జనాభాగల యూక్రేనియను రిపబ్లికూ * కూడా యీ సభకు 25 గురు ప్రతినిధులనే యెన్నుకుంటాయి. ఈ పద్ధతివల్ల పెద్ద రిపబ్లిక్కులకూ చిన్నవానికీ సమానత్వం కలుగజేయబడుతూంది. అధికారాల్లో, హక్కుల్లో— సంపూర్తియైన స్వయంనిర్ణయాధికారం, భాష, వైజ్ఞానిక విషయాలలో స్వాతంత్ర్యం యివ్వడంద్వారా సోవియటు ప్రభుత్వం, మైనారిటీ జాతుల సమస్యను జయప్రదంగా పరిష్కరించింది.

స్టాలిన్ చెప్పినట్లు : "జాతీయ ద్వేషాలను కలహాలను పురిగొల్పే ధనికవర్గాల దోపిడీవిధానాన్ని నాశనంచేయడం, రాజ్యాంగాధికారం అంతర్జాతీయతాభావ ప్రేరితులూ, జాతీయవాద నిరోధకులూ అయిన శ్రామిక వర్గం చేతిలోవుండడం, వివిధజాతుల మధ్య పరస్పర సహకారం, సోదరభావం పెంపొందడానికి కారణమయేయి. ఉత్తమ జాతీయ అంతర్జాతీయ సూత్రాలను మేళవించి సోవియటు విజ్ఞానం ప్రజల జీవితాల్లో, మానసిక తత్వంలో గొప్ప మార్పును కలుగజేసింది". 'వివిధజాతుల బందిఖానా' అని లెనిన్‌చే పిలువబడిన రష్యాలో నేడు వందకుపైగా జాతులు స్వేచ్ఛగా సోదరభావంతో నివశిస్తున్నారు.

* సోవియట్ యూనియన్‌లో 16 సోవియట్ రిపబ్లిక్స్ వున్నాయి. ఇవి భాషా ప్రయుక్తంగా వుండి, తగినంత వైశాల్యం, జనాభా, సంస్కృతి, ఆర్థికదక్షత గల్గి వుంటాయి. వీటిలో ఒక్కొక్కదానిలో తిరిగి కొన్ని మైనారిటీలు నివసించే ప్రాంతాలను జనాభాసంఖ్యనుబట్టి ఆటానమస్ రిపబ్లిక్, ఆటానమస్ రీజియన్, నేషనల్ యేరియా; అనే తరహాలుగా విభజించేరు. ఈవిభాగాలకి తమభాషను, సంస్కృతినీ వృద్ధిపరచుకొనే హక్కులున్నాయి. అంటే ఒక రిపబ్లిక్‌లోగల అంతర్విభాగాలకు, వాటి భౌతిక పరిస్థితులనుబట్టి కొన్ని కొన్ని అధికారాలు, హక్కులు యీయబడినాయి. ఈరీతిగా కొద్దివేలమంది మాత్రమే గల ఒకచిన్నజాతికిగూడ సంపూర్ణవికాసానికి హక్కు, అవకాశం యీయబడింది.

"తత్ఫలితంగా సోవియట్ యూనియన్ నేడు సంపూర్తిమైన 'అసంఖ్యాకజాతుల రాజ్యాంగం' (మల్టీ నేషనల్ సోవియట్ స్టేట్) గా ప్రపంచ ప్రజల యెదుట ఆదర్శంగా నిలచింది. ఇంతకుముందు ప్రపంచంలో ఏ దేశంలోనూ సాధించియుండనంత జయప్రదంగా మైనారిటీ సమస్యను సోవియటు యూనియను పరిష్కరించగల్గిందనీ, తద్వారా ప్రజలందరి సహకారంతోకూడిన ప్రజాప్రభుత్వాన్ని, బలీయమైన రాజ్యాంగాన్ని నిర్మించగల్గిందనీ మనం గర్వంతో చెప్పుకోవచ్చు."

వివిధజాతుల మధ్య సహకారం, సుహృద్భావం వున్ననాడే తాము సోషలిస్టు సమాజనిర్మాణందెసకు ముందడుగు వేయుట సాధ్యమౌతుందని సోవియటుప్రజల దృఢవిశ్వాసం. ప్రముఖ రచయితలూ, కళాకుశలురూ అంతర్జాతీయతాభావాలనూ, ప్రజలతో ఐకమత్యాన్నీ తమ రచనలద్వారా వుద్బోధిస్తున్నారు. నేడు సోవియటు యూనియనులో కోట్లకొలది ప్రజల హృదయాల్లో యీవుత్తమభావాలే ప్రతిఫలిస్తున్నాయి.

మధ్య ఆశియాలోని 'డుంగాన్స్' లో సోవియటు ప్రజల ఐకమత్యాబలాన్ని నిరూపించే ఒక జనవాక్యం వుంది.

"చితుగులన్నీ దగ్గరగా పేరిస్తే భోగిమంట పెద్దగా వెలుగుతుంది."

# బాలబాలికలు

విప్లవానికి పూర్వం నేనో యెలిమెంటరీస్కూలు టీచరుగా పని చేసేను. విప్లవానంతరం నుండీకూడా నేను పిల్లల్లోనే పనిచేస్తున్నాను. సోవియటు ప్రభుత్వం వచ్చిన యీ ఇరవైయేళ్లలో ప్రజల జీవితంలో—ముఖ్యంగా బాలబాలికల జీవితసౌఖ్యం, విద్యావకాశాలు, భావ్యభివృద్ధి విషయాల్లో—చాలా గొప్ప అభివృద్ధికమైన మార్పులు జరిగేయి. ఆ అభివృద్ధిని సంఖ్యారూపకంగా చూపెట్టినప్పుడు యిదినిజమా అని ఆశ్చర్యం కలకగమానదు. ఉదాహరణకు సెకండరీస్కూల్సు 19000% (మునుపు 100 కి యిప్పుడు 19 వేలు) యెక్కువయేయి!

అన్నివిషయాల్లో జారిస్టురష్యా యితరదేశాలకన్న వెనుకబడి యున్నా శిశుమరణాల సంఖ్యలో మాత్రం ప్రథమస్థానం కొట్టేసింది. ఘోరదారిద్ర్యంలో మునిగి సరియైన తిండీ గుడ్డా యెరగని ప్రజలు—చిన్నపిల్లలచేతకూడా ఫాక్టరీల్లో పనిచేయించే ధనికవర్గదోపిడీవిధానం—వీటివలన శిశుమరణాల సంఖ్య నానాటికి పెరుగుతూ వచ్చింది కాని తగ్గలేదు.

ప్రస్తుత పరిస్థితులకీ పూర్వపువాటికీ యేకోశానా పోలికేలేదు. జాతీయసంపద వెనుకటికన్న ఐదురెట్లు పెరిగింది. లాభాలన్నీ తామే మింగేసే ధనికవర్గాలు నిర్మూలించబడుటవలన యీదేశాదాయం అంతా ప్రజలకొరకే వారి జీవిత వ్యయపరిమాణాన్ని యెక్కువ చేయడానికే వుపయోగింపబడుతూంది. సోవియటు పరిశ్రమ లత్యద్భుతంగా పెరిగేయి. వాటిల్లో పనిచేయడాని కెన్నో లక్షలపనివాళ్లు అవసరం. అయినా సరే 14 ఏళ్ల వయసు పిల్లల నేపనిలోనూ నియోగించరాదని శాసించింది ప్రభుత్వం. గనుల్లో పనికి 17 యేళ్ల లోపువాళ్లను పెట్టుకోకూడదు. మిగిలిన పనుల్లో 14—16 మధ్యవయసు పిల్లలు ఫాక్టరీ

ఇన్‌స్పెక్టరునుండి ప్రత్యేక అనుమతి పత్రం పొందినట్లైతే పనిలో ప్రవేశించవచ్చును. వారిని రోజుకు 4 గంటలకంటె పని చేయించరాదు. అదైనా అనుభవజ్ఞులైన బోధకుల పర్యవేక్షణక్రింపనే. సోవియటు యూనియనులో శక్తిమించిన పనితో అలసిపోయి, జీవితం అంటే నిరుత్సాహం పొంది మొహం వేళ్లాడేసుకొనియున్న పిల్లలు మనకు కనపడరు.

అల్లా అని మేం కుర్రవాళ్లని శుద్ధ సోమరిపోతులుగా తయారు చేస్తున్నాం అనుకుంటారేమో! పొరపాటు. ఈకుర్రవాళ్లే సోషలిస్టు సమాజనిర్మాతలైన భావిపౌరులనే సంగతి చెప్పుడూ మాదృష్టిలో వుంటుంది. ఆకార్యసాధనకు వలసిన మహత్తర సుగుణాలని, మన సత్త్వాన్ని వారిలో కలిగించుటే మాయుద్దేశం.

స్కూల్లో బుద్ధిగా చదువుకోవాలి; ఆటపాటల్లో తమ దేహబలాన్ని ఆరోగ్యాన్ని పెంపొందించుకోవాలి; కాలేజీలు వదలేక సోవియటు యూనియను పౌరులుగా తమ ధర్మాలను, విధులను నిర్వర్తించుటకు తయారు కావాలి. మానసికంగా, శారీరకంగా, తమదేశంలో యేం జరుగుతూందో, తమ సోషలిస్టు సమాజం యేమహదాశయ సాధనకు కృషి చేస్తూందో, ఆ అభివృద్ధిగతిని యేమార్గాలవల్ల యింకా వేగంగా కొనసాగించవచ్చునో, ఇవన్నీ తెలిసికొని యుండుట:—యివీ మాకుర్రవాళ్లలో మేంచూసే సద్గుణాలు. వారిలో చైతన్యం వుత్సాహం కల్గించి వారికి మంచి శిక్షణ యిస్తాం. ఇందుకోసం మేమేమీ నిర్బంధం వుపయోగించనక్కరలేదు. పిల్లలు ప్రభుత్వం తమకోసం పడుతూన్నశ్రమ, తమ అభివృద్ధికొరకు చూపుతూన్న శ్రద్ధా అడుగడుక్కీ ప్రత్యక్షంగా అనుభవిస్తూనే వున్నారు. తాముకూడా ప్రభుత్వం యెదల, అంటే తమ సోషలిస్టు సమాజంపట్ల నిర్వర్తించవలసిన బాధ్యతలున్నాయని వారు కూడా గుర్తించి యేవిధమైన నిర్బంధమూ అవసరంలేకుండానే తమ విధులను సరిగా నెరవేరుస్తారు.

సోవియటు బాలబాలికలు యెవడికీ లొంగి సలాములు పెట్టరు. తమ ఆత్మగౌరవం, వ్యక్తిత్వం నిలబెట్టుకుంటూనే కర్తవ్యనిర్వహణం చేస్తారు. తాముపొందే విద్య, శిక్షణ యివన్నీ వూరికే పెద్దవాళ్ళ కన్నీళ్లు తుడవడానికి కాదనీ, అవి తమ భావిఔన్నత్యానికేననీ, సోషలిస్టురాజ్యాంగంయొక్క పురోభివృద్ధి పూర్తిగా తమమీదనే ఆధారపడియుందనీ వారు గుర్తిస్తారు.

పిల్లలేకాదు, పెద్దలేమరచిపోయేరు పూర్వపు బానిసమనస్తత్వాన్ని. మన సోషలిస్టు సమాజంలోని నూతన స్వేచ్ఛావాతావరణాన్ని మన పిల్లలు పూర్తిగా అనుభవిస్తున్నారు. ముందుగతి యేలాగ అనే చింత అవసరం లేకపోడంచేత వారు తమ దైహిక మానసిక శక్తుల నభివృద్ధి చేసికొని, విద్యలో వుత్తీర్ణులై తమ భావి కర్తవ్యనిర్వహణకు తయారవుతున్నారు.

తమ సమాజంలో యెవరిని చూసినా ఒక్కటే ప్రధానవిషయం వారిమనస్సుకు నాటుతుంది. తాము శ్రద్ధగా చదువుకుంటే తమ పురోభివృద్ధికి లోటులేదనీ, తమయిష్టంవచ్చినవృత్తిలో ప్రవేశించడానికి తగిన యవకాశాలన్నీ వున్నాయనీ వారు గ్రహిస్తారు.

సెకండరీవిద్య పూర్తికాగానే తమకుతోచిన వృత్తిలో, వ్యాపారంలో ప్రవేశించవచ్చు. వాళ్ళ నడ్డుపెట్టే పెద్ద నిర్బంధాలేమీలేవు. పైగా యెన్నో అవకాశాలున్నాయి. కాలేజీలో చేరి చదువదలచుకుంటే వారికి ప్రభుత్వమే అలవెన్సు యిస్తుంది!

1914 నుండి 1921 వరకూ జరిగిన యుద్ధాలూ, అంతర్యుద్ధాలతో లక్షలకొలది పిల్లలు దిక్కులేనివాళ్ళయేరు. మొదటినుండీ, యెన్నో కఠినపరిస్థితుల నెదుర్కోవలసియున్నా, సోవియటు ప్రభుత్వం పిల్లల అభివృద్ధి విషయంలో యెక్కువ శ్రద్ధవహించింది. దేశం ఆర్థికంగా దివాలాస్థితిలోవుంది. యెటుచూసినా కరువు; నలుమూలలా శత్రువులే.

అయినాసరే ధైర్యంతో నిలబడి తనకార్యక్రమాన్ని జయప్రదంగా కొన సాగించింది. తత్ఫలితంగా వెనుకవీధుల్లో నిరాధారంగా తిరిగే పిల్లకాయ లంతా మంచిపనివాళ్ళుగా, వుత్తమపౌరులుగా తయారయేరు. వారిందరికీ గౌరవజీవనావకాశాలు కల్పింపబడ్డాయి. చిన్నతనంలో సోమరిపోతులుగా తిరిగే దురలవాటును నిర్మూలించడంలో సోవియటు ప్రభుత్వం నిర్బంధ విధానం, జైలుశిక్షలు ప్రయోగించలేదు. వారికి విద్యాబుద్ధులుచెప్పి, జీవనాధారం చూపించి వారిని స్వతంత్రవ్యక్తులుగా తయారుచేసింది.

పిల్లలఅభివృద్ధికార్యక్రమంలో బికారీగాతిరిగేఅలవాటు తొలగించు టొక చిన్నభాగం మాత్రమే. ప్రజల్లో 100 కి 90 మందికి చదువు రానే రాదు. జారు ప్రభుత్వకాలంలో ప్రజలకు ప్రభుత్వం తమబాగుకోసం యే పనైనా చేస్తుందనే నమ్మకం లేశమాత్రంకూడా వుండేదికాదు. పిల్లల ఆటస్థలాలు, కిండర్ గార్డెన్సు, నర్సరీలు ఆ ప్రజలు కలలోకూడా చూసి యుండరు. సోవియటు ప్రభుత్వం కొత్తగా యివన్నీ ఓనమాల దగ్గర్నుంచీ మొదలుపెట్టవలసి వచ్చింది. దేశం నలుమూలలా వేలకొలదిగా కొత్తస్కూల్సు కట్టబడినై. వివిధ భాషలు సంస్కరింపబడి ఆ యా భాషల్లోనే విద్యాబోధన జరపబడుతూంది. కొన్నిజాతులప్రజలు కాగితం యెందుకోకూడా తెలియనిస్థితిలో వుండేవారు. దేశంమొత్తంమీద నిరక్షరాస్యత, అజ్ఞానం తొలగించడానికి యెంతోమంది టీచర్లకు శిక్షణ యివ్వబడింది. నర్సరీలు, కిండర్‌గార్డెనులు, పిల్లల క్లబ్బులు, సోవియటు యూనియనులో బాలబాలికల నిత్యజీవితానుభవంలోకొచ్చేయి.

1937-38 లో 864 క్లబ్బులు; 170 పార్కులు; 174 థియేటర్లు; 760 టెక్నికల్ అండ్ ఆర్టు స్కూల్సు పిల్లలకొరకు కట్టబడ్డాయి. 10 మిలియన్లపైగా పిల్లలు టెక్నికల్, కల్చరల్ విద్యను పొందుతున్నారు. 1933-38 మధ్య 20,607 కొత్తస్కూల్సు తెరవబడ్డాయి. నిర్బంధ ప్రాథ

మికవిద్య ప్రవేశపెట్టబడింది. 1938-42 మధ్య పట్టణాలలో సెకండరీ విద్యను, మిగతాచోట్ల జూనియరు హైస్కూలు విద్యనూ నిర్బంధం చేస్తారు. వీటన్నిటినిబట్టీ పిల్లలకొక జీవితాదర్శాన్నీ, వారికో జీవితాధారాన్నీ యివ్వడానికి సోవియటు ప్రభుత్వం యెంత శ్రమ, శ్రద్ధ తీసుకుంటూందో తెలుస్తుంది.

ప్రభుత్వం, యితర ప్రజాసంస్థలు వివిధపట్టణ ప్రాంతాలలో పిల్లలక్యాంపులు యేర్పాటుచేస్తాయి, వేసవుసెలవుల్లో. 1939 లో వీటిలో 14 లక్షలమంది పాల్గొన్నారు.

మా స్కూలుపిల్లలతో నామటుకు నేను సోవియట్ యూనియన్ అంతటా ఏడుసార్లు యాత్రచేసేను. వేలకొలది మైళ్ల రైలుమీద, నీటిమీద, కాలినడకను తిరిగేము. యూనియనులోని వివిధప్రాంతాలలో వివిధ కాలాలలో ప్రయాణంచేసేము. నదులమీద, సముద్రతీరాల్లో, పర్వతాల మీద చిన్నచిన్న మకాములు చేసేము. ప్రతీచోటా ప్రజలు మమ్మల్నెంతో ఆదరించి తమ ఫ్యాక్టరీలు, స్కూల్సు, క్లబ్బులు అన్నీ చూపించేవారు. ఏ స్కూళ్ళూ, టీచర్లూ యివ్వలేని విజ్ఞానాన్ని, ప్రపంచజ్ఞానాన్ని, జీవితానుభవాన్ని యీ క్యాంపులు, యాత్రలు కలుగజేస్తాయి పిల్లలకు. సోవియటు బాల బాలికలు విద్య పూర్తియేనాటికి మంచి ప్రపంచానుభవంకలిగియుంటారు.

రోజూ స్కూలువర్కు అయిపోవడంతోటే పిల్లలు తమక్లబ్బులకుపోయి తమ అభిరుచులనుబట్టి ఆటపాటలలో, కళలలో పాల్గొంటారు. వారి అభిరుచులను కార్యరూపంలో పెట్టడానికి తగినసహాయం, పరికరాలు ఆ క్లబ్బుల్లో యివ్వబడతాయి.

సోవియటు కుర్రవాళ్ళు యంత్రాలవిషయంలో గొప్ప అభిరుచిని కనబరుస్తున్నారు. 12-16 మధ్య వయసువారిలో సాంకేతిక సమస్యల్లో

కుతూహలం కనబర్చనివాళ్ళుగాని, మామూలుయంత్రా లన్నిటియొక్క ప్రాథమికసూత్రాలు తెలియనివాళ్ళుగాని వుండనేవుండరు. వారి టెక్నికల్ జ్ఞానాభివృద్ధికోసం యీ క్లబ్బులేకాక ప్రత్యేకంగా అనేక ఉద్గ్రంథాలు పుస్తకాలు ప్రకటింపబడుతున్నై. సోవియటు యూనియను పరిశ్రమలకు సమర్థులయిన టెక్నీషియన్లను తయారుచేయడానికి యీవిధానాలన్నీ యెంతో వుపకరిస్తున్నాయి.

పిల్లలయెడల చిన్నతనంనుంచీ ప్రభుత్వం చూపుతూన్న శ్రద్ధ, వ్యయం వృథాకాలేదని, రెడార్మీ, నౌకాదళం, కళలు, సాహిత్యం, రాజకీయాలు- ఒకటేమిటి? అన్నిశాఖల్లోకీవస్తూన్న సమర్థులూ, పుత్సాహవంతులూ అయిన యువకులసంఖ్యనుబట్టి తెలిసికోవచ్చును.

# యువజనులు.

సోవియట్ యూనియనులో బహుళప్రచారంలోవున్న పాటలో ఒక చరణంలో:—

"యువకు లభివృద్ధిపొందడానికి తగినఅవకాశాలన్నీవున్నై.
వృద్ధులు యేచోటికిబోయినా గౌరవింపబడుతున్నారు".

ఇందులో యేమీ అతిశయోక్తి లేదు. సోవియటు యూనియన్‌లో మానవు డత్యుత్తమజీవిగా గౌరవింపబడుతున్నాడు. అతని జీవితానికి వెలలేని విలువ యివ్వబడుతూంది. సోవియట్ భూమిలో నిరుద్యోగం, దారిద్ర్యం, నిర్మూలింపబడినై. ప్రజల జీవిత వ్యయ పరిమాణం క్రమంగా యెక్కువౌతూంది. రేపు ఎలాగ? అనేచింత యెవడికీ లేదు. వృద్ధులను, అశక్తులను ప్రభుత్వం పోషిస్తుంది. యువకులు స్వశక్తితో పైకి రావడానికి యెన్నో అవకాశాలున్నాయి. యువకులు తమ అవకాశాలను వినియోగించుకొనేందుకు, తమ ఆశయాలను సాధించేటందుకు ప్రభుత్వం యెన్నోవిధాల సహాయంచేస్తుంది. శ్రామికవర్గాన్ని ఆర్థికంగా, వైజ్ఞానికంగా ఉన్నతికి తేవడానికై ప్రభుత్వం, ప్రజాహితసంస్థలూ యెడతెగని కార్యదీక్షతో పనిచేస్తున్నాయి.

నేటి బాలురూ యువకులే సోషలిస్టుసమాజనిర్మాతలగు భావిపౌరులనే సత్యాన్ని సోవియటుప్రజలు గుర్తించి, వారి నభివృద్ధిలోనికి తెచ్చుటకై యెట్టి త్యాగములనైనా చేయసిద్ధపడుతున్నారు. నేటి సోషలిస్టుసమాజం సాధించినవిజయాలను కాపాడుకొంటూ, "ప్రతివాడూ తన శక్త్యనుసారం పనిచేయాలి; ప్రతివానికీ వాని అవసరాలను తీర్చాలి" అనే సూత్రంమీద కమ్యూనిస్టు సమాజం స్థాపించవలసిన బాధ్యత వీరిపైనేవుందని సోవియటు ప్రజలు గుర్తిస్తున్నారు.

వెనకటి రోజుల్లో 12 యేళ్ళలోపు కుర్రవాళ్ళచేత రోజుకి 12 గంటల చొప్పునకూడా పనిచేయించేవారు ఫాక్టరీల్లో. జీతంమాత్రం పెద్ద పనివాళ్ళకన్న తక్కువయిచ్చేవారు. సోవియటు యూనియను శాసనం ప్రకారం 14–16 యేళ్ళ మధ్య వయసువారు రోజుకు 4 గంటలు; 16–18 మధ్యవారు 6 గంటలుకన్న ఫాక్టరీల్లో పనిచేయరాదు. జీతం మాత్రం పెద్దవాళ్ళతో సమానంగానే యిస్తారు. 17 యేళ్ళలోపు వారిని గనుల్లో పనికీ, యితర అపాయకరమైన వృత్తుల్లోనూ పనికి పెట్టుకోరాదు. అంటే సోవియటు యూనియనులో పిల్లలు శారీరక మానసికాభివృద్ధిని పొందుటకూ, ఏవృత్తిలోనైనా ప్రవేశించేముందు తగిన విద్య నార్జించియుండుటకూ తగినఅవకాశాలు యివ్వబడుతున్నాయన్నమాట.

నిర్బంధ ప్రాథమికవిద్య చాలాకాలంక్రితమే ప్రవేశపెట్టబడింది. ప్రస్తుతం మాధ్యమిక (సెకండరీ) విద్యను నిర్బంధంగా ప్రవేశపెట్టడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. 1933-38 మధ్య ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలా (ఎలిమెంటరీ, సెకండరీస్కూలు) విద్యార్థులసంఖ్య 230 లక్షల నుండి 330 లక్షలకు పెరిగింది.

సోవియటు యూనియనులో సెకండరీవిద్య పూర్తియేక సామాన్యంగా చాలమంది కాలేజీల్లో, విశ్వవిద్యాలయాల్లో, మిలిటరీ స్కూళ్ళలో చేరతారు. మిగిలినవారు తమకు నచ్చిన, తమకు ప్రావీణ్యతయున్న వృత్తిలోగాని, వ్యాపారంలోగాని ప్రవేశిస్తారు. అటువంటివారుకూడా తమ వృత్తిలోవుంటూనే వున్నతవిద్యాభ్యాసంచేసే ప్రత్యేకావకాశాలున్నాయి. నిరుద్యోగం అనే సమస్య సోవియటు యువకుల నెదుర్కోనే యెదుర్కొనదు. అది పూర్తిగా నిర్మూలింపబడింది. 1936 నాటికి సోవియటు పరిశ్రమలు, వ్యవసాయంలో 70 లక్షల యువకులు పనిచేస్తున్నారు. సోవియటు యూనియనులోని కార్మికుల, ఉద్యోగుల మొత్తంలో మూడోవంతు 23 యేళ్ళలోపు వయసువారే. అనేక పెద్దఫాక్టరీలు, మిల్లులో యువజనుల సంఖ్య సగంవరకూకూడా వుంది.

ప్రతివానికీ వృత్తి కల్గించడమేకాక, తమ మానసిక వికాసాన్ని, శాస్త్రపరిజ్ఞానాన్నీ, తమపనిలో నైపుణ్యతనూ పెంపొందించుకొనేందుకు వారికొరకు ప్రత్యే టెక్నికల్ స్కూల్సు, స్టడీ సర్కిల్సు యేర్పాటు చేయబడతాయి.

ప్రతిఫాక్టరీకి అనుబంధంగా అందులోని పనివారికొరకు వృత్తి విద్యలునేర్పే "ఒకేషనల్ స్కూల్సు" వుంటాయి. ఉత్సాహం, తెలివితేటలుపున్న పనివారి కీ స్కూళ్ళలో వూరికేనే శిక్షణనిస్తారు. ఈ స్కూళ్ళలో ప్రతి విద్యార్థికి అతని అభిమానవిషయంలో ప్రత్యేకశిక్షణ యిస్తూనే, విద్యార్థులందరకూ మొత్తంమీద సెకండరీవిద్యకు సమానమైన సామాన్య విద్యను నేర్పుతారు. ఈ స్కూల్సుకు ప్రత్యేకం వర్కుషాప్సు, లేబరేటరీలు అన్నీ వుంటాయి. సమర్థులైన యింజనీర్లు, టెక్నీషియన్లు యీస్కూళ్లలో అధ్యాపకులుగా వుంటారు. వీటిలో చదువుకొనే విద్యార్థులందరకూ విద్యార్థివేతనా లీయబడతాయి. విద్య పూర్తయేక ఆతడు ప్రత్యేక ప్రావీణ్యత సంపాదించిన వృత్తిలో వుద్యోగం యిస్తారు. ఇప్పటికి యీ స్కూల్సునుండి 20 లక్షలమంది నేర్పరులైన పనివారు తయారయేరు. వారిలో చాలమంది గొప్ప టెక్నీషియన్లుగా తయారై వుత్పత్తిలో ఉన్నతప్రమాణాలు స్థాపించేరు. దేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతూన్నకొలదీ పనివాళ్ళకొరకు గిరాకీ యెక్కువైంది. నిపుణులైన పనివారిని తయారు చేయుటకుగాను కళాశాలలు, టెక్నికల్ స్కూల్సు యెన్నో కొత్తగా స్థాపింపబడినై. జారిస్టురష్యాలో వున్నత కళాశాలలు 91 వుండేవి. నేడో: 6,01,000 విద్యార్థులతో 716 వున్నత కళాశాలలు, యూనివర్శిటీలు వున్నాయి. జారిస్టు రష్యాలోకన్న 24 రెట్లెక్కువ విద్యార్థులతో 2,500 టెక్నికల్ స్కూల్సున్నాయి. 1928-37 మధ్య కాలంలోనే 15 లక్షలమంది యువకులు యీ స్కూల్సులో టెక్నీషియన్లుగా శిక్షణపొందేరు.

స్వయంకృషితో తెలివితేటలువున్న ప్రతివ్యక్తి ఉన్నతస్థితికి రావడానికి అవకాశాలు కల్పింపబడినాయి, సోవియటు సమాజంలో. దేశీయార్థిక రాజకీయ జీవితంలో పాల్గొనుటకు తమకీయబడిన హక్కులను సోవియటు యువజనులు పూర్తిగా వినియోగించుకుంటున్నారు. ఒక యేడాదికంటె మరొకయేడాది పెద్ద బాధ్యతాయుత స్థానాల్లోకి వొస్తున్న-సరిగా పాతికేళ్ళయినా దాటని,- యువకులసంఖ్య పెరిగిపోతూంది. 1937 జూలై లెక్కలప్రకారం పెద్ద పరిశ్రమల్లో పనిచేసే ఇంజనీర్లు, టెక్నీషియన్లలో 19% వరకూ 26 సంవత్సరాలలోపు వయస్సువాళ్లే. 30 సంవత్సరాలు దాటని యువజనులు వివిధ ఫాక్టరీల డైరెక్టర్లలో 10·4%— చీఫ్ ఇంజనీర్లలో 18·5%— డిపార్టుమెంటల్ మేనేజర్లలో 26·1% వున్నారు. సరిగా 28 యేళ్లుదాటని "క్రివొనోస్" దేశంలోని పెద్ద ట్రంక్ లైన్సులో ఒకటైన సౌత్ డానెట్జ్ రైల్వేకు జనరల్ మేనేజరు. మొన్నటివరకూ ఇంజను డ్రైవరుగావుండిన "ట్రాటిస్కాయా" యిపుడు మాస్కో సర్క్యూట్ రైల్వేకు జనరల్ మానేజరు. జెర్జిన్స్కీ రైల్వే మానేజరైన 'ఓగ్నేవ్'కూడా మొదట ఇంజనుడ్రైవరే. 25 సంవత్సరాలు దాటని 'షెగొలెవ్' మాస్కోలోని పెద్ద బట్టలమిల్లుకు డైరెక్టరు. వీటన్నిటినిబట్టి తెలిసికోవలసిం దేమిటంటే సోవియటు యూనియనులో ఉన్నత పదవుల్లోకి రావడానికి వయస్సుతోగాని, ధనంతోగాని పనిలేదనీ, శక్తి సామర్థ్యాలుంటే చాలుననీ, ఉత్సాహవంతులైన కుర్రవాళ్లని ధైర్యంగా బాధ్యతాయుత స్థానాలకు నియమిస్తున్నారనీ. అనుభవజ్ఞులైన పెద్దవాళ్ళకు కూడా ప్రతి వృత్తిలో గౌరవం చూపబడుతూనేవుంది. పెద్దల అనుభవ విజ్ఞానాలతో యువకుల వుత్సాహశక్తుల్ని జోడించి సోషలిస్టు సమాజ నిర్మాణం గావిస్తూంది సోవియటు ప్రభుత్వం.

1938 జూన్ లెక్కల ప్రకారం 30 యేళ్లు దాటని 4,260 మంది యువతీ యువకులకు ప్రభుత్వం బిరుదప్రదానం చేసింది. ఇందులో

586 గురు యూనియనులో అత్యుత్తమగౌరవంగా పరిగణింపబడే ఆర్డర్ ఆఫ్ లెనిన్ పతకం తమ ప్రజాసేవకుగాను పొందేరు. 1,566 మందిపైగా వివిధ పరిశ్రమల్లో కొనియాడదగిన సామర్థ్యం చూపినందుకు గౌరవింపబడ్డారు.

సమిష్టి వ్యవసాయక్షేత్ర డైరక్టర్లుగా, పశువైద్యులుగా, వ్యవసాయ శాస్త్రజ్ఞులుగా, జంతుస్వభావజ్ఞులుగా యెందరో యువకులు పేరు ప్రతిష్ఠలు పొందేరు. 15 లక్షలకుపైగా ట్రాక్టరు డ్రైవర్లుగా, ఆపరేటర్లుగా శిక్షణ పొందేరు.

సోవియటు యూనియనులో శాస్త్రీయ విజ్ఞానశాఖల్లో అత్యుత్తమ స్థానాలకు పోవడానికికూడా కుర్రతనం యేమీ అడ్డంకిరాదు. ప్రపంచ ప్రఖ్యాతులైన శాస్త్రజ్ఞులు చాలమందేవున్నారు సోవియటు యువజనుల్లో. పోంత్రియాజిన్ చిన్నవాడేమైనా లెక్కల ప్రొఫెసరుగా వున్నాడు. అలెగ్జాండ్రోవ్ తన 29 వ యేటే ఫిలాసఫీ ప్రొఫెసరయేడు. నామట్టుకు నేను నా 29 వ యేట మాస్కో యూనివర్శిటీ ప్రొఫెసరుగా వున్నాను. ఈ యేడు నన్ను ఎకాడమీ ఆఫ్ సైన్సెస్ సభ్యునిగా యెన్నుకున్నారు. అంతర్జాతీయ సంగీత పోటీల్లో బహుమతులు పొందిన సోవియటు యువకు లనేకులున్నారు.

సోవియట్ యువజనులకు పూర్తి రాజకీయహక్కు లున్నాయి. "జాతి, మత విచక్షణలతో; ఆస్తి, చదువులతో నిమిత్తంలేకుండా 18 సంవత్సరాలు దాటిన ప్రతి సోవియటు పౌరునికీ యెన్నికల్లో వోటివ్వడానికీ, తాను సభ్యుడుగా యెన్నుకోబడుటకూ హక్కు, అర్హతా వున్నాయి." (135 సూత్రం.) అనేకమంది యువతీ యువకులు యూనియను కేంద్ర సోవియటుకూ, రిపబ్లిక్కుల సుప్రీం సోవియట్లకూ సభ్యులుగా యెన్నుకోబడ్డారు. యూనియన్ కేంద్ర శాసనసభా సభ్యుల్లో 284 గురు 30 యేళ్ళ లోపువాళ్లే. రిపబ్లిక సోవియట్లలో 1009 మందీ

(28·2%); ఆటానమస్ రిపబ్లిక్కుయొక్క శాసనసభల్లో 692 మంది (30%) యువకసభ్యు లున్నారు.

వైజ్ఞానికంగాకూడా వారు సత్వరాభివృద్ధి చెందుతున్నారు. రైతులుగానీ, కూలీలుగానీ, పుస్తకాలు, పత్రికలు చదవడం వారికొక దినకృత్యం. నాటకాలకు, మ్యూజియములకు, సినీమాలకు పోయి తమ విజ్ఞానాన్నభివృద్ధి చేసుకొనే అవకాశాలెన్నో వున్నాయి వారికి. రోజులో పనిచేసే గంటలు తక్కువకావడంచేత తమ మిగతా విశ్రాంతికాలాన్ని సారస్వత, కళా, సాంకేతిక, నాటకప్రదర్శన కార్యాల్లో సద్వినియోగం చేస్తారు. స్పోర్ట్సు సొసైటీల్లో ఒక కోటికిపైగా యువతీ యువకులు సభ్యులుగా వున్నారు. వారి యుపయోగార్థమై 650, స్టేడియమ్ము, 7,200 ఆట స్థలాలు, 350 చెరువులు, 100 ఫిజికల్ కల్చర్ సెంటర్లు, 2,713 తాలింఖానాలు వున్నాయి. జారిస్టు రష్యాలో ఒక్క స్టేడియంకూడా వుండేది కాదు. ఉన్న కొద్ది ఆటస్థలాలుకూడా ధనవంతులకుమాత్రమే అందుబాటులో వుండేవి.

ఆడవాళ్లుకూడా యేవిషయంలోనూ పురుషులకు తక్కువగా లేరు. అనేకమంది స్త్రీలు పరిశ్రమల డైరక్టర్లుగా, చీఫ్ ఇంజనీర్లుగా, శాస్త్రజ్ఞులుగా వున్నారు. శ్లాఘనీయమైన ప్రజాసేవకుగాను 603 స్త్రీలు ప్రభుత్వంచే గౌరవింపబడ్డారు. వివిధ సోవియట్లలో 600 మంది స్త్రీలు సభ్యులుగా వున్నారు. యకాయెకీని మాస్కోనుండి పసిఫిక్ తీరానికి అపూర్వ ధైర్య సాహసాలతో, నైపుణ్యంతో విమానయాత్రలుచేసింది సోవియటు స్త్రీలే. (వాలెంటినా.)

వెనుకటి ధనికవాద సమాజాన్ని, దోపిడీవిధానాన్ని చవిచూడని కొత్తతరం బయల్దేరింది. వారికి ప్రజాసేవ, స్వార్థత్యాగం, స్వయంకృషి, సుశిక్షణ, సుకౌశలం,—ఇవన్నీ వుగ్గుపాలతో బోసిన మహత్తర సుగుణాలు, తాము పుట్టిపెరిగిన సోషలిస్టు సమాజాన్ని యెంతో

భక్తితో ప్రేమిస్తారు. రెడ్ ఆర్మీలో పనిచేయడం ఒక వుత్తమ గౌరవంగా భావిస్తారు వారు. మెరికలవంటి యువకు లత్యుత్సాహంతో రెడ్ ఆర్మీలో దేశాభిమాన ప్రేరితులై చేరుతారు. హసన్ సరస్సు ప్రాంతంలో జపాను ఫాసిస్టులు దురాక్రమణ తలపెట్టినపుడు, సోవియటు యువకుల అకుంఠిత దేశాభిమానం, వారి యుద్ధ కౌశలం వెల్లడయేయి. జపానువారు అధిక జననష్టంతో పారిపోయేరు. సోవియటు యువజనుల హృదయాల్లో వారి మాతృదేశానికే ప్రథమస్థానం యివ్వబడుతుంది. ఈ ప్రకరణం మొదట్లో యిచ్చిన పాట యీ క్రింది చరణంతో ఆఖరౌతుంది:—

"శత్రుడెవడైనా మనదేశాన్నణచివేయడానికి,
మన మాతృభూమిని నాశనంచేయడానికి తలపెడితే
దిమ్మతిరిగే మెరుపుదెబ్బతో తక్షణమే బుద్ధిచెబుతాం."

---

ప్రపంచ చరిత్రలో నేడు సోవియట్ :

| | |
|---|---|
| 1. విద్యార్థుల సంఖ్య | మొదటి స్థానం |
| 2. ధాన్యాలు | ,, |
| 3. బీట్ దుంపలు | ,, |
| 4. ట్రాక్టర్లు | ,, |
| 5. ఇతర వ్యవసాయ యంత్రాలు | ,, |
| 6. యంత్రాలు | రెండోస్థానం |
| 7. రైల్వే గూడ్సుపెట్టెలు | ,, |
| 8. బంగారం | ,, |
| 9. ఇనుము | ,, |
| 10. ఎలక్ట్రిసిటీ | ,, |
| 11. ఉక్కు | ,, |
| 12. బొగ్గు | ,, |

# స్త్రీలు.

జారు ప్రభుత్వకాలంలో స్త్రీ, చదువు సంధ్యలులేని మూర్ఖురాలుగా, యెట్టిహక్కులూలేని బానిసగా చూడబడేది; ప్రభుత్వంలోగాని, ప్రజా జీవనంలోగాని ఆమెకు ప్రవేశమేలేదు.

సరిగా తిండికైనా చాలనికూలి, అతిదారుణమైన అనారోగ్యకర వాతావరణంలో పనిచేయడం, మూర్ఖత్వం, వీటితో కూలీవర్గపు ఆడదాని జీవితం దుర్భరంగా వుండేది. వొంచిననడుం యెత్తకుండా వుదయం మొదలు సాయంత్రంవరకూ కష్టించినా కడుపునిండా తిండిలేదు.

అనాగరక జాతుల్లో స్త్రీ దురవస్థ యింకా యెక్కువగావుండేది. ఆమె యితరుల ముఖం చూడకూడదు, ఘోషా. వాళ్ళలో ఆడపిల్ల పుట్టడం ఒక దురదృష్టంగా పరిగణింపబడేది.

అటువంటి దుర్భరజీవనం గడుపుతూన్న స్త్రీలకు సోషలిస్టు విప్లవం ఒక ఆశాజ్యోతిని చూపించింది. వారికి పురుషులతో సమాన హక్కులూ, జ్ఞానార్జనావకాశాలూ యిచ్చి, వారి నుద్ధరించింది.

"సోవియటు యూనియనులో ఆర్థిక, రాజకీయ, సాంఘిక వ్యవహారాలన్నిటిలో స్త్రీ పురుషులకు సమానహక్కు లీయబడుతున్నాయి."

"ఆ హక్కుల నుపయోగించుకునేందుకు స్త్రీలకీ క్రింది అవకాశాలు యివ్వబడుతున్నాయి; ఉద్యోగంచేయడానికి హక్కు, అవకాశాలు; జీతం, విశ్రాంతి, విద్యావకాశాలు; సాంఘిక భీమాపద్ధతి; తల్లికి, బిడ్డకు ప్రభుత్వ రక్షణ; పూర్తిజీతంతో శిశుజననానికి ముందూ, తర్వాతా సెలవు; వారి ఆరోగ్యం కొరకు ప్రసూతి గృహాలు, శిశుసంరక్షణాలయాలు; కిండర్ గార్డెన్స్." (122 సూత్రం)

"ఎన్నుకొనుటకూ, యెన్నుకోబడుటకూ పురుషులతోబాటు సమానహక్కులు స్త్రీలకు యివ్వబడుతున్నాయి." (137 సూత్రం)

సోవియటు ఆర్థికవ్యవస్థలో నేడు లక్షలకొలది స్త్రీలు నియోగింపబడ్డారు. 1928-37 మధ్యకాలంలో యేదోఒక పనిలోవున్న స్త్రీలసంఖ్య 30 లక్షలనుండి 90 లక్షలకు పెరిగింది.

జారిస్టు రష్యాలో పనిపాటలుచేసే స్త్రీలలో 55% జమీందార్ల, ధనికుల యిండ్లలో దాసీలుగానూ; 25% పెద్ద ఎస్టేట్లులో కూలీలుగానూ; 13% పరిశ్రమల్లో కూలీలుగానూ; 4% విద్యా, ఆరోగ్యశాఖల్లోనూ పనిచేసేవారు. 1936 లో 39% పెద్ద పరిశ్రమల్లోనూ; 15% వ్యాపారంలోనూ, 20% డాక్టర్లు, టీచర్లుగానూ వున్నారు. 2% మాత్రమే గృహకృత్యాలు చేసేవారుగా వున్నారు. మిగతా 24% కళల్లో, విజ్ఞానంలో కృషిచేస్తున్నారు. స్త్రీలు పనిపాటల్లోనూ ప్రజాజీవితంలోనూ యెక్కువగా పాల్గొనుటకు వీలుగా ప్రభుత్వం అనేక శిశుసంరక్షణాలయాలు, కిండర్ గార్డెన్సు నెలకొల్పింది. పనిసమయంలో తల్లులు తమ పిల్లలను వాటిలో నిశ్చింతగా వొదిలి పనిలోకి పోవచ్చు. 1937 లో యీ శిశుసంరక్షణాలయాలు, కిండర్‌గార్డెన్సులో 18 లక్షలమంది పిల్లలకు స్థానంయివ్వబడింది. 1942 నాటికి 42 లక్షలమంది కవకాశం వుండేలా కొత్తవాటిని నిర్మిస్తున్నారు. వ్యవసాయపు పనుల రోజుల్లో సమిష్టిక్షేత్రాలచే నెలకొల్పబడిన తాత్కాలిక శిశు సంరక్షణాలయాలు, కిండర్‌గార్డెన్సులో 57 లక్షలమంది పిల్లలకు ప్రవేశమీయబడింది.

ప్రజా (పబ్లిక్) భోజనశాలలు, వండడానికీ, తినడానికీ సిద్ధపరచబడిన భోజనపదార్థాల అమ్మకంమూలంగా స్త్రీలకు యింటిపనికూడ చాలవరకు చులకనైంది. సోవియటు యూనియనులో 30 వేలకుపైగా పబ్లికు హోటల్సున్నాయి. 1939 లో వాటిఅమ్మకం 13,50 కోట్ల రూబుల్సు! సమానపనికి సమానజీతం—స్త్రీకైనాసరే, పురుషునికైనాసరే! స్త్రీలుకూడా రోజుకి 7 గంటలే పనిచేయాలి. కొన్ని పరిశ్రమల్లో 6 గంటలే. శ్రామికులందరూకూడా పూర్తిజీతంతో కొంతకాలం సెలవు పుచ్చుకోవచ్చు.

స్త్రీలకే సెలవు లెక్కువ యివ్వబడతాయి. స్త్రీలశక్తికి మించినవనుకొనే పనుల్లో యిప్పుడెంతోమంది స్త్రీలు పనిచేస్తూవున్నారు ఇప్పుడు సోవియట్ రైల్వేల్లో 5 లక్షలమంది స్త్రీలు— అందులో చాలమంది బాధ్యతాయుత స్థానాల్లో పనిచేస్తున్నారు. 400 మంది స్టేషన్ మాష్టర్లుగా, 10 వేలమంది ఇంజనీర్లు, టెక్నీషియన్లుగా పనిచేస్తున్నారు. అనేక పారిశ్రామిక శాఖల్లో స్త్రీలు మేనేజర్లుగాకూడా వున్నారు. స్త్రీలుద్యోగాల్లోలేని పరిశ్రమగాని, ప్రభుత్వశాఖగాని లేనేలేదు. అన్నివృత్తుల్లోనూ స్త్రీలు ప్రముఖస్థానాల్లో వున్నారు. ఒక్క సోవియటు యూనియనులో లక్షమంది స్త్రీలు ఇంజనీర్లుగా వున్నారు. ప్రపంచములోని మిగతా దేశా లన్నిటిలో కలిపి 10 వేలమంది మాత్రమే స్త్రీ ఇంజనీర్లున్నారు. జారిస్టు రష్యాలో స్త్రీ డాక్టర్లసంఖ్య రెండువేలు. నేడు 70 వేలమంది స్త్రీ వైద్యులున్నారు.

సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో 1 కోటి 90 లక్షలమంది స్త్రీలు పనిచేస్తున్నారు. నియమితమైన పనిగంటలు, మంచి జీతాలు, తగినవిశ్రాంతి, సెలవులు వుంటాయి. వెనకటి రోజుల్లో స్త్రీ కష్టమైనపనేదీ చేయలేదనీ, క్లిష్టమైన యంత్రాల నుపయోగించలేదనీ తలచబడేది. కాని నేడు వేలకొలది స్త్రీలు ట్రాక్టరు డ్రైవర్లుగా, కంబైన్ ఆపరేటర్లుగా, టెక్నీషియన్లుగాను పనిచేస్తున్నారు సోవియటు ప్రభుత్వం స్త్రీల ఆరోగ్యరక్షణను ప్రధానంగా పరిగణిస్తుంది. కొన్ని పరిశ్రమల్లో 18 యేళ్ళలోపు స్త్రీలు పనిచేయకూడదని నిబంధనచేసేరు. గర్భిణీతోవున్న ఆరో నెలనుంచి పురుడు వచ్చిన తర్వాత ఆరునెలలవరకూ స్త్రీలను రాత్రిళ్లు పనిచేయించరాదు.

స్త్రీలకు మామూలుసెలవులుకాక పురిటికిముందు 35 రోజులూ, తర్వాత 28 రోజులు పూర్తిజీతంతో సెలవిస్తారు. *సమిష్టిక్షేత్రాల్లోని

* ప్రస్తుతం యీ సెలవు మొత్తం 63 నుంచి 77 రోజులకు పెంచేరు. కష్టమైన కాన్పు, కవలబిడ్డలు పుట్టినసందర్భాల్లో ప్రసూతిఅనంతరం మరో 14 రోజులు సెలవు యిస్తున్నారు. —అనువాదకుడు.

స్త్రీలకు ఆ రెండునెలలూ వారి సగటుసంపాదన వారికిస్తారు. ఆనెలవులకు ముందుకూడా కొన్నినెలలు వారిని అదేజీతంతో తేలికపనుల్లో నియోగిస్తారు. చంటిబిడ్డల తల్లులు పిల్లలకు పాలివ్వడానికిగాను ప్రతి మూడున్నర గంటలకూ ఒకఅరగంట చొప్పున విరామంయిస్తారు. సోవియటు యూనియనులో వివాహంఅంటే స్త్రీ పురుషులు పరస్పరాంగీకారంతో భార్యాభర్తలుగా కలిసియుండుటకు చేసికొన్న యేర్పాటు. సోవియటు వివాహశాసనం తల్లీ బిడ్డల హక్కుల్ని రక్షిస్తుంది. వారి వ్యక్తిగత హక్కుల్ని, ఆస్తిహక్కుల్ని, సంరక్షించేందుకూ, సంఘంకోసమూ వివాహాలను రిజస్టరుచేయడం ప్రోత్సహింపబడుతూంది. రిజిస్టర్ చేయక పోయినా యిబ్బందిలేదు. న్యాయశాస్త్ర దృష్టిలో పిల్లలందరకూ సమాన హక్కులున్నాయి.

పరస్పరాంగీకారంతోగాని, భార్యాభర్తల్లో యేవొకరైనా కోరితేగాని విడాకులకు అనుమతి యివ్వబడుతుంది. పిల్లలపోషణ కెవరెంతసొమ్ము యివ్వాలో, వా రెవరిదగ్గర వుండాలో న్యాయస్థానంలోనే నిర్ణయింపబడుతుంది.

తల్లికి, బిడ్డలకు రక్షణనిచ్చుట, తరచు గర్భస్రావము చేసికొనే పద్ధతిని తొలగించుట మొత్తంమీద కుటుంబజీవితాన్ని బలపరచుటఅనే ఆశయాలతో ప్రభుత్వం 1936 లో ఒకబిల్లును ప్రవేశపెట్టింది. ఆ చట్ట ప్రకారం— తల్లిఆరోగ్యానికి అత్యవసరమైతేతప్ప- గర్భస్రావం చేసికొనుట నిషేధింపబడింది. అది అవసరమైనవాళ్లు ప్రభుత్వ వైద్యశాలల్లో స్పెషలిస్టులచేతనే చేయించుకోవాలి. దారిద్ర్యం, నిరుద్యోగంలేని సోషలిస్టు సమాజంలోనే కుటుంబజీవితాన్ని వున్నతస్థితికి తెచ్చేందుకు చేసే ప్రయత్నాలు జయప్రదములౌతాయి. ప్రతివానికీ వృత్తీ, జీవనాధారమూ, స్త్రీల కార్థికస్వాతంత్ర్యం వుండడంవలనా, పిల్లల పోషణకూ, భావి అభివృద్ధికీ ప్రభుత్వం బాధ్యతతీసికొనడంవలనా, పై గర్భస్రావ నిరోధక

చట్టం జయప్రదంగా అమలుజరుపబడుతూంది. పిల్లల తల్లులకు ప్రభుత్వం ఎలవెన్సులూ, విరాళాలు యిస్తుంది. ఏడోబిడ్డకు పుట్టినదిమొదలు 5 సంవత్సరాలు వచ్చేవరకూ యేడాదికి రెండువేలరూబుల్సు— పదిమంది పిల్లల తర్వాత ప్రతికాన్పుకూ 5 వేల రూబుల్సూ యిస్తుంది. ఆ శిశువుకు మూడోయేడు వొచ్చేవరకూ యేడాదికి మూడువేల రూబుల్సు యిస్తుంది. ఈ శాసనోద్దేశం పూర్తిగా ఫలప్రదమైంది. డైవోర్సులసంఖ్య ఒక్కమాటుగా తగ్గిపోయింది. 1936 లో మాస్కోలో 16,182 డైవోర్సులు రిజస్టరయేయి; ఆ సంఖ్య 1937 నాటికే 8,951 వరకూ పడిపోయింది. 1936 లో మాస్కోలో శిశుజననాలు 71,703; కాని 1937 లో 1,35,848 పిల్లలు పుట్టేరు.

సోవియటు ప్రభుత్వంయొక్క 'వయోజన విద్యా ప్రణాళిక'లో 4 కోట్లమంది— ఇందులో చాలమంది స్త్రీలు— శిక్షణ పొందేరు. వీరిలో అధికసంఖ్యాకు లూరికే చదువనూ వ్రాయనూ నేర్చుకోడంతో తృప్తిచెందక తమకోసం ప్రత్యేకం యేర్పాటుచేయబడిన స్కూల్సులో వున్నతవిద్యలో వుత్తీర్ణులయేరు. సోవియటు యూనియనులోని 601,000 కళాశాలావిద్యార్థుల్లో 43% స్త్రీలే. మెడికల్ స్కూల్సులో వారిసంఖ్య యింకా యెక్కువ. ఆటలు, విమానాలనుండి పారచూట్లతో పురకడం, తుపాకి కాల్చడం మొదలైన స్పోర్ట్సులో స్త్రీలు యెక్కువ అభిరుచీ, ప్రావీణ్యతా కనబరుస్తున్నారు.

జారిస్టు రష్యాలో బహువ్యాప్తిలోనుండే వ్యభిచారవృత్తి నేడు యించుమించుగా నిర్మూలింపబడింది. పూర్వం యే యితరవృత్తీలేక, దారిద్ర్యబాధ పడలేక యీ వృత్తిలో దిగేవారు. సోవియటు ప్రభుత్వం వ్యభిచారానికి మూలకారణాలైన దారిద్ర్యాన్నీ, నిరుద్యోగాన్నీ నిర్మూలనం చేయగలిగింది. ఆ వృత్తి మానినవారికి కొత్తవృత్తివిద్యలు నేర్పి జీవనాధారం కల్పించింది ప్రభుత్వం.

దేశపరిపాలనలో, రాజ్యాంగనిర్వహణంలో, ప్రజాహితసంస్థల్లో స్త్రీలు బాధ్యతాయుతస్థానాల్లో వుండి సేవచేస్తున్నారు. సోవియట్ యూనియన్ కేంద్రశాసనసభలో 189 గురు. వివిధరిపబ్లికుల సోవియట్లలో 848 గురూ సభ్యురాండ్రున్నారు.

పరిశ్రమల్లో వేలకొలది స్త్రీలు స్టాఖనోవైట్సుగా వుత్పత్తి నధికం చేయడానికి కృషిచేస్తున్నారు. హెక్టారుకి (2·47 యెకరాలు) 50 టన్నుల సుగర్‌బీట్సు పండించి, మేరియా డెమ్చెంకో. సుగర్‌బీటు వుత్పత్తిలో సోషలిస్టు పోటీకి నాందీప్రస్తావన చేసింది. ఇప్పుడు హెక్టారుకి 100 టన్నుల సుగర్‌బీట్సు పండించే వ్యవసాయకురాండ్రు చాలమంది వున్నారు. ట్రాక్టరు డ్రైవర్లుగా యెందరో స్త్రీలు కొత్తరికార్డ్సు స్థాపిస్తున్నారు. విమానచోదక నైపుణ్యంలో ప్రధమస్థానం సోవియట్ స్త్రీదే.

సోవియటు ప్రభుత్వంలో అనేకస్త్రీలు ప్రముఖస్థానాల్లో వున్నారు. ఒకామె మత్స్యపరిశ్రమశాఖామంత్రి; ఒకామె అజర్‌బైజాన్‌లో ఆరోగ్యశాఖామంత్రి; యూనియను మంత్రివర్గముయొక్క వుపాధ్యక్షుల్లో ఒకామె స్త్రీ. శాస్త్రవిజ్ఞానశాఖల్లో 12,500 కు పైగా స్త్రీలు పనిచేస్తున్నారు. ఫిజియాలజీ, బయోకెమిస్ట్రీల్లో నిధియైన డాక్టర్ లీనా స్టెర్న్ ఆకాడమీ ఆఫ్ సైన్సెస్ (విజ్ఞానపరిషత్తు) మెంబరుగా యెన్నుకోబడింది.

"నామటుకు నేను మొదట్లో కూలిపని చేసేదాన్ని. క్రమంగా చదువుకొని, వృద్ధిలోకొచ్చి యిప్పుడు యూనియన్ సుప్రీం సోవియటు సభ్యురాల నయేను."

"1929 లో ఒక సమిష్టి వ్యవసాయక్షేత్రంలో కూలికి చేరేను. కాని, 1930 లోనే మాస్కోకు నాభర్తదగ్గరకు వెళ్ళిపోవాల్సి వచ్చింది. అక్కడ గృహనిర్మాణపరిశ్రమలో కూలీగా చేరేను. పట్టుదలతో చదివి, పని నేర్చుకున్నాను. 1932 లో మేస్త్రీగా నియమింపబడ్డాను. నాపని నైపుణ్యతను గుర్తించి ప్రభుత్వం నాకు, "ఆర్డర్ ఆఫ్ ది రెడ్ బానర్

ఆఫ్ లేబర్" పతకం యిచ్చి గౌరవించింది. 1934 లో నన్ను మా ఫాక్టరీనుండి మాస్కో సోవియటుకు ప్రతినిధిగా యెన్నుకున్నారు. 1937 లో మాజిల్లా సోవియటుకు అధ్యక్షురాల నయేను. తర్వాత కొద్ది కాలంలోనే యూనియన్ సుప్రీం సోవియటు కెన్నుకున్నారు. మొన్నటి వరకూ సామాన్యకూలీగావున్న నేను యిప్పుడు దేశపరిపాలనలో పాల్గొంటున్నాను. జిల్లాసోవియటు అధ్యక్షపదవి సరిగా నిర్వహించడానికి ఇంజనీరింగు, గృహనిర్మాణం, ఆర్థికం మొదలైనవెన్నో తెలిసి యుండాలి. మాజిల్లా సోవియట్ బడ్జటు 3·7 కోట్ల రూబుల్సు; పార్కులు, శానిటేషను, లైటింగు, పరిశ్రమలు, పబ్లిక్‌వర్క్సు యివన్నీ జిల్లాసోవియటు అధికారంలోనివే. చైర్మన్‌గా నేను చేయవలసిన యీపైపనులతో బాటు, జిల్లా ప్లానింగుడిపార్టుమెంటు, విద్యాశాఖ, ఆరోగ్యశాఖలమీద కూడ పర్యవేక్షణాధికారం నిర్వర్తించాలి. ఇటువంటి బాధ్యతాయుత స్థానాల్లోవున్న స్త్రీల సంఖ్య క్రమేణా యెక్కువౌతూంది."

స్త్రీ పిల్లల్నికని, పెంచడానికీ, వంట వండడానికీ తప్ప మరెందుకూ పనికిరాదని ఫాసిస్టుల సిద్ధాంతం. సోవియటు స్త్రీల పరిస్థితున్ని చూస్తే ఆసిద్ధాంతంలో వీసమంతైనా నిజం లేదని ప్రతివానికీ బోధపడుతుంది.

19 శతాబ్దంలో రష్యాలో విద్యాభివృద్ధికెంతో ప్రయత్నించిన 'ఛెర్నిషెవ్‌స్కీ' యిలా వ్రాసేడు ; "ప్రకృతిసిద్ధంగా స్త్రీయొక్క మేధాశక్తి అతితీవ్రం, సునిశితం కాని గుడ్డిదైన సంఘం దాన్నితొక్కి నలిపి పారేస్తూంది. ఆ అద్భుతమేధాశక్తినే కనక సరిగా వుపయోగించుకుంటే మానవుడు నేటికన్న పదిరెట్లు వేగంతో అభివృద్ధి చెందుతాడు." సోవియటు యూనియనులో స్త్రీయొక్క మేధాశక్తి సంఘోపయోగం కొరకు సరియైన వుపయోగంలో పెట్టబడుతూంది.

# ముసలితనంలో

సోవియటు యూనియనులో ముసలివాళ్ళనీ. అశక్తుల్నీ ప్రభుత్వమే పోషిస్తుంది. పురుషులకు 60 యేళ్ళు, స్త్రీలకు 55 సం॥రాలు దాటితే వారికి ప్రభుత్వం పెన్షన్ (వుపకారవేతనం) యిస్తుంది. ఏకారణం చేతనైనా ఆ వయస్సుకి ముందే అశక్తత సంభవించినట్లయితేకూడా పెన్షను యీబడుతుంది. పనిచేసేటప్పుడు కలిగిన అపాయాల మూలంగానూ, ఆపనిలో కలిగిన వ్యాధులవల్లనూ యిట్టి అశక్తత కలిగినట్లయితే అతడు పనిచేసి యుండిన కాలంతో నిమిత్తం లేకుండానే పూర్తిపెన్షను యివ్వబడుతుంది.

అపాయకరమైన వృత్తుల్లోనూ. గనుల్లోనూ పనిచేసేవారికి వారి గరిష్ఠవేతనంలో 60% పెన్షన్‌గా యిస్తారు. లోహపరిశ్రమల్లో పనిచేసే వారికి 55%, తేలిక పరిశ్రమల్లో వారికి 50% పెన్షను యిస్తారు. ఒకేచోట అంతరాయం లేకుండా పనిచేసినందుకు వివిధపరిశ్రమల్లో 10% మొదలు 25% వరకూ అదనపుపెన్షన్ ఇస్తారు. ఉదా: గనుల్లో పనివారికి 10 సం॥ కన్న యెక్కువ ఒకేచోట పనిచేస్తే 25% అదనంగా యిస్తారు. లోహ పరిశ్రమల్లో పనివారికి 12 సం॥కన్న యెక్కువ ఒకేచోట పనిచేస్తే 20% అదనంగా యిస్తారు. శాస్త్రీయవిజ్ఞానశాఖల్లో పనిచేసి రిటైరైనవారికింకా యెక్కువ పెన్షన్లు యిస్తారు. కళాశాలల్లో 25 సం॥రాల సర్వీసు వున్న శాస్త్రజ్ఞులకు వారి ఆఖరి వుద్యోగకాలపు జీతంతో సమానంగా పెన్షనిస్తారు. 25 సం॥ సర్వీసున్న యితర అధ్యాపకులు, డాక్టర్లు మొదలైనవారికి వారి సంపాదనలో 50% పెన్షనిస్తారు.

సాంఘిక భీమాపద్ధతి సోవియటు ప్రభుత్వకాలంలో చాలా అభివృద్ధి చెందింది. 1938 నాటికి యీ భీమాసంబంధమైన ప్రజోపయోగ కార్యాలకు 300 కోట్ల రూబిల్సు ప్రత్యేకింపబడ్డాయి.

పెన్షనివ్వడంతో కార్మికుల, ఉద్యోగుల యెడల తనధర్మం పూర్తయిందని సోవియటు ప్రభుత్వం భావించదు. వారికెన్నో యితర సౌకర్యాలనుకూడ కలిగిస్తుంది. శానిటోరియములు, ఆరోగ్యకేంద్రాలు, రెస్టుహోమ్సు, యెన్నో కట్టించింది. ఎవరి కే అంగవైకల్యం యేర్పడినా శస్త్రచికిత్సవల్ల బాగయే అవకరాలన్నీ అట్లు బాగుచేయ బడతాయి. కుంటి, గ్రుడ్డివాళ్ళకు వారికి తగినవృత్తి విద్యలు నేర్పి జీవనాధారం కల్పింపబడుతుంది. పూర్వపు రాజకుటుంబీకుల, జమీందార్ల రాజభవనా లన్నీ నేడు యిటువంటి ప్రజోపయోగసంస్థలకుగాను వుపయోగింపబడు తున్నై. అశక్తుల శరణాలయాల కనుబంధంగా వ్యవసాయక్షేత్రా లుంటాయి. వాటిలో తేనె పరిశ్రమ, కోళ్ళను పెంచండం, కూరగాయలు పెంచడం మొదలైన చిన్నచిన్న పరిశ్రమలు చేస్తుంటారు.

ఈశరణాలయాల్లో విద్యావినోదాలకు వలసిన యేర్పాట్లన్నీ చేయ బడతాయి. వార్తాపత్రికలు, పుస్తకాలు వారికి యెక్కువగా సప్లై చేస్తారు. నాటకప్రదర్శనాలు, సినీమాలు, పాటకచేరీలు యెన్నో వారి వినోదం కొరకు, విజ్ఞానం కొరకు యేర్పాటు చేయబడతాయి. ఎన్నో ఆరోగ్య కేంద్రాలు, శానటోరియములు, వైద్యశాలలు వారికొరకు యేర్పాటు చేయ బడినై. నల్లసముద్రతీరాన్నున్న సోచిలోని శానటోరియం, కిస్లోవోడ్స్కు లోని ఆరోగ్యకేంద్రం ప్రపంచప్రసిద్ధి చెందినై.

ముసలివాళ్లు, అశక్తులూ తమశక్తికి తగినట్లుగా వృత్తుల నవలం బించి జీవనభృతి సంపాదించుకొనేందుకై ప్రభుత్వం ప్రత్యేక సహకార పరిశ్రమల స్కీము పెట్టింది. ప్రస్తుతం యీస్కీములో రెండులక్షల మంది పనిచేస్తున్నారు. 1938 లో వారు వుత్పత్తిచేసిన సరకుల విలువ 300 కోట్ల రూబుల్సు దాటింది. వీరు సగటున నెలకు 300 రూబుల్సు సంపాదిస్తారు. నాలుగైదు వందలు సంపాదించేవారుకూడా చాలమంది వున్నారు.

ప్రభుత్వం తమకిచ్చే సౌకర్యాలకు తోడుగా వీరు తమ భీమా సంస్థలద్వారాకూడా యెక్కువ సౌకర్యాలు పొందుతున్నారు. 1938 లో యీభీమాసంస్థలు తమసభ్యుల సౌకర్యాలకొరకు 5·8 కోట్ల రూబుల్సు వ్యయపర్చేయి. 1·57 కోట్ల రూబుల్సు ప్రత్యేకం శానటోరియములు, ఆరోగ్యకేంద్రాలు, విశ్రాంతిగృహాలకొరకే ఖర్చుపెట్టబడినై. ఒకకోటి రూబుల్సు పైగా సభ్యుల పిల్లలకోసం ఖర్చుపెట్టబడినై.

ఇన్ని సౌకర్యాలూ పల్లెటి రైతులకుకూడా చేస్తుంది ప్రభుత్వం. విప్లవానికి పూర్వం బీదరైతు అతి దుర్భరజీవనం గడిపేవాడు. ముసలివాడు కుటుంబాని కొక గుదిబండ. తిండి తప్పదు; పనిచేయ లేడు. అంచేత ముసలివాడు చస్తే మిగిలినవాళ్ళు దేవుడికో నమస్కారం చేసేవారు, బాధ వొదిలి పోయినందుకు.

"ముసలితనం ప్లేగుతోసమానం" అనే పాతసామెత నేడు సోవియటు యూనియనులో యెక్కడా విన్పించదు. సమిష్టి వ్యవసాయపద్ధతి రైతుజీవితంలో గొప్ప మార్పును తెచ్చిపెట్టింది. ముష్టివాళ్లు, నిరాధారులు, సోమరిపోతులు ప్రస్తుతం యెక్కడా కన్పించరు.

రైతులు ముసలితనంచేతగాని, శారీరకమైన అశక్తతవలనగాని పనిచేయలేకపోయినప్పుడు సమిష్టిక్షేత్రాలే వారిని పోషిస్తాయి. నిబంధనల ప్రకారం సమిష్టిక్షేత్రాల మొత్తంఆదాయంలో 2% సహాయనిధి కివ్వాలి. ఈ సహాయనిధులకెంతో పెద్దనిధులు యేర్పడ్డాయి. ఆ ధనం సభ్యుల యొక్క, వారి కుటుంబాలయొక్క సౌకర్యాలకోసం ఖర్చుచేయబడుతుంది. విశ్రాంతి గృహాలు, శరణాలయాలు నిర్మించడంకోసం యీ సంస్థలు 1937–38 లో 15 కోట్ల రూబుల్సు ఖర్చుచేసేయి.

ప్రతి సోవియటు పౌరునికీ "పనిచేయుటకు హక్కు" వుంది. తక్కువ పనిగంటలు. మంచి రక్షణవిధానాలు, పరిశ్రమల్లో, వ్యవసాయంలో వినూత్నయంత్రాల నుపయోగించడం, జీతంతో సెలవులు,

యింకా అనేక సౌకర్యాలు—వీటిమూలంగా యెవనికీకూడా పనిచేయడం అంటే కష్టంఅనిపించదు. పైగా సోవియటువిధానంలో ప్రతివాడూ తన కొరకే కష్టిస్తున్నాననేభావం కలిగియుంటాడు. సమాజంలో తానొకభాగం అనీ, తన విద్యుక్తధర్మం కష్టించి పనిచేయుటేఅనీ ప్రతిపౌరుడూ తలుస్తాడు. అంచేత సుఖజీవనానికిచాలిన పెన్షను వస్తున్నాకూడా శక్తి వున్నవాళ్ళు శరీరం దాచుకోకుండా తమ మామూలువృత్తుల్లోనే వుండి పోతారు. అటువంటివాళ్ళకి పెన్షనూ, జీతమూకూడా యిస్తారు.

డానెట్జ్ బొగ్గుగనుల్లో పనిచేస్తూన్న ఫియొదోర్ కోస్ట్రామిన్ యిలా చెప్పతున్నాడు: "నాకిపుడు 62 యేళ్లున్నాయి. నెలకు 327 రూబుల్సు పెన్షనువొస్తుంది నాకు. కానీ నాకింకా పనిచేసేశక్తి తగ్గలేదు. అంచేత నేను మామూలుగా నాపనిచేస్తూ, నెలకు 900 రూబుల్సు సంపాదిస్తున్నాను. మ్యునిసిపల్ బ్యాంకు యిల్లుకట్టుకొనేందుకు—10 సంవత్సరాల్లో తీర్చే పద్ధతిమీద—నాకు 3,000 రూబుల్సు అప్పిచ్చింది. దాంతో ఒక చిన్న అందమైన యిల్లు కట్టుకున్నాను."

పెన్షనుతీస్తూన్న సమిష్టి వ్యవసాయకుల దృక్పథంకూడా యిదే మోస్తరు. ఆ ముసలివాళ్ళంతాకూడా యేదో తమ శక్త్యనుసారం పని చేయడానికి తయారే. వారిని యితరులందరూ యెంతో గౌరవంతో చూస్తారు. వారిని 'క్షేత్ర పర్యవేక్షకులు' (సూపర్‌వైజర్స్) మొదలైన బాధ్యతగల స్థానాలకు యెన్నుకుంటారు తరుచుగా.

"యువకులకు తగిన అమూల్యావకాశాలు,
వృద్ధులకు యెందుబోయినా గౌరవాదరాలు."

"వృద్ధాప్యంలో, జబ్బుచేసినపుడు, పనిచేయుశక్తి నశించినపుడు ప్రతి సోవియటు పౌరునీ ప్రభుత్వమే పోషిస్తుంది. సోషల్ యిన్సూరెన్సు స్కీములు; ప్రజలకు వుచిత వైద్యసహాయం; శ్రామికుల వుపయోగార్థం అనేక ఆరోగ్యకేంద్రాల నిర్మాణం మొదలైనవాటిద్వారా వారికెన్నో

సౌకర్యాలు కల్గించి వారియెడల తన బాధ్యతను సోవియటు ప్రభుత్వం సంపూర్తిగా నిర్వహిస్తుంది." (120 సూత్రం; 1936 సోవియటు రాజ్యాంగ ప్రణాళిక.)

---

# ప్ర జా రో గ్య ము.

లేబరేటరీలు, హాస్పిటల్సు, రీసెర్చి ఇన్‌స్టిట్యూట్సు, మెడికల్ కాలేజీలు, శానటోరియములు— ఒకటేమిటి ? సోవియటు యూనియనులో ప్రజారోగ్యానికి సంబంధించిన ప్రతీదీ ప్రభుత్వంచేతిలోనే వుంటుంది. వాటన్నిటికి కావలసిన ఖర్చంతా ప్రభుత్వమే భరిస్తుంది. దేశంలో మెడికల్ డిపార్టుమెంటులోనివారందరూ— డాక్టర్లు, నర్సులు, శాస్త్రవేత్తలు, ప్రొఫెసర్లు— ప్రభుత్వంచే నియమింపబడినవారే. వారందరకూ సుఖజీవనానికీ, తమ పరిజ్ఞానాన్ని పెంపొందించుకొనేందుకు కావలసిన సౌకర్యాలు, పరికరాలు అన్నీ యివ్వబడతాయి. మెడికల్ సైన్సులో కలుగుతూన్న కొత్తమార్పులు, జరుగుతూన్న నూతన పరిశోధనలు వారందరకూ అందుబాటులో వుంచబడతాయి. అందుకొరకు ప్రత్యేకస్కూలుల్సు వుంటాయి.

జారిస్టు రష్యాలో (1913) డాక్టర్లసంఖ్య 19,785 మాత్రమే. 1937 లో వారిసంఖ్య 1,32,000 కు పెరిగింది పల్లెటిప్రాంతాల్లోవున్న డాక్టర్లసంఖ్య వెనకటికన్న $2\frac{1}{2}$ రెట్లు పెరిగింది. నేషనల్ రిపబ్లిక్కుల్లో యీ అభివృద్ధి మరీస్పష్టంగా కన్పిస్తుంది. జారు ప్రభుత్వ కాలంలో అజర్‌బైజాన్ అంతకూ 991 డాక్టర్లూ, తాజిక్‌స్తాన్ అంతలో 13 డాక్టర్లూ వుండేవారు. నేడు అజర్‌బైజాన్‌లో 2,480 మంది, తాజిక్‌స్తాన్‌లో 372 మందీ డాక్టర్లున్నారు.

1913 లో జారు ప్రభుత్వం ప్రజారోగ్యశాఖమీద చేసిన ఖర్చుకన్న 1937 లో సోవియటు ప్రభుత్వం ప్రజారోగ్యంకొరకు చేసిన వ్యయం 75 రెట్లు; 1937 లో 1,030 కోట్ల రూబుల్సు అందుకొరకు ప్రత్యేకింపబడ్డాయి. 1913 లో వైద్యసంబంధంగా ఖర్చుచేసినది తలకు $\frac{9}{10}$ రూబుల్సు, 1937 లో సగటున తలకు 60 రూబుల్సు ఖర్చు పెట్టబడుతూంది.

ఇతరశాఖ లన్నిటికివలెనే ఆరోగ్యశాఖ కార్యక్రమంకూడ ఒక నిర్ణీతమైన ప్లానుప్రకారం నడుస్తుంది. ప్రతి సంవత్సరారంభంలోనూ యూనియను ఆరోగ్యశాఖామంత్రివర్గం, వివిధ రిపబ్లిక్కులలోని ఆరోగ్యశాఖాధికారులుకూడి ఆలోచించి దేశంలో యే ప్రాంతలో యెన్ని హాస్పిటల్సు, శానటోరియములు, మెడికల్ స్కూల్సు, ప్రసూతి వైద్యశాలలు నిర్మించాలో నిశ్చయిస్తారు. ఆరోగ్యశాఖ కార్యక్రమంఅంతా ఒకటేప్లాను ప్రకారం నడుస్తూండడంవలన వివిధసౌకర్యాలను దేశంలోని అన్ని ప్రాంతాల ప్రజలకూ అందుబాటులోవుండేలా చేయడానికీ, వివిధ వైద్య సంస్థలమధ్య సామరస్యం, సహకారం పెంపొందించడానికీ వీలవుతుంది.

సోవియట్ ఆరోగ్యశాఖా కార్యక్రమంలో రోగచికిత్సకంటె రోగనిరోధము (స్వస్థవృత్తము) కెక్కువ ప్రాధాన్యతనిస్తారు. ప్రజల ననారోగ్యమునుండి కాపాడుటకెంతో శ్రద్ధతీసుకోబడుతూంది. అంటువ్యాధులను నిరోధించడానికీ, ప్రజలఆరోగ్యాన్నీ, పారిశుభ్రతనీ పెంపొందించడానికీ దేశంఅంతటా యెన్నో 'శానిటేషన్ ఆర్గనైజేషన్లు'న్నాయి. ఈ సంస్థలే కాక మామూలు వైద్యశాలలన్నిట్లోకూడ రోగనిరోధక వైద్యంలో యెంతో పరిశోధన, కృషీ చేయబడుతూంది. సోవియటు మెడికల్ స్కూల్సులో అందుచేతనే (హైజీను) ఆరోగ్యసూత్రాలకు యెక్కువ ప్రాధాన్యత నిస్తారు. ట్రేడ్‌యూనియన్లు, సముష్టిక్షేత్రాల శానిటరీ ఇన్‌స్పెక్టర్లు, హెల్తు కమిషన్సు, పట్టణ, జిల్లా సోవియట్ల హెల్తుబోర్డ్సు—ఇవన్నీ

ప్రభుత్వ ఆరోగ్యశాఖకెంతో సహాయపడతాయి. వీరికి ఆరోగ్యసూత్ర బోధనాకేంద్రాలు (హైజీన్ ఎడ్యుకేషనల్ సెంటర్సు) లో శిక్షణ యివ్వబడుతుంది. ఈ బోధనా కేంద్రాలయొక్కపని, పోస్టర్లు, సినీమాలు, ఆరోగ్యప్రదర్శనాలు, మాజిక్‌లాంతరు లెక్చర్లద్వారా ఆరోగ్య విద్యా ప్రచారం చేయడం. ప్రజలందరకూ పరిశుభ్రత, ఆరోగ్యంయొక్క ఆవశ్యకత నచ్చచెప్పబడుతుంది.

శారీరక, మానసికారోగ్యాలకు మూలకారణాలైన దారిద్ర్యం, అజ్ఞానం, నిరుద్యోగం తొలగించడంతో, ఆరోగ్యవృద్ధి జయప్రదంకావడానికి కావలసిన పునాది వేయబడిందన్నమాట. ప్రజల్లో విజ్ఞానం, విద్య, సుఖజీవనావసరాలు యెక్కువకావడంతో ప్రజారోగ్యంకూడ యెన్నోరెట్లు అభివృద్ధిచెందింది.

పారిశ్రామిక నిర్మాణంఅంతా ఆరోగ్యసూత్రాలప్రకారమే నడిచింది. నూతనపట్టణాలు కట్టడంలోకూడ శానిటేషనుకు, ఆరోగ్యానికీ ప్రాధాన్యత యివ్వబడింది. జారిస్టు రష్యాలో నీటి సరఫరా; మురుగుపోపు సదుపాయాలువున్న పట్టణాలసంఖ్య చాలతక్కువ. నేడు వాటిసంఖ్య యించుమించు 500 దాటుతుంది. దీపాలు. నీటిసరఫరా సౌకర్యాలు వెనకటివలె ఒక్క ధనవంతులకు మాత్రమే కాక, ఆ ప్రదేశంలోని ప్రజాసామాన్యం అంతకీ వుపయోగిస్తున్నాయి. వెనుకటి గుడిసెలుండే పేటలు, కూలకొట్టేసి వాటిస్థానే పట్టణ శ్రామికులకొరకు మంచి గాలీ, వెల్తురూ వొచ్చే విశాలభవనాలు కట్టబడ్డాయి.

సమిష్టిక్షేత్రాలు ప్రజోపయోగకార్యాలకు చాల ధనం ఖర్చుపెడతాయి. ఆర్మీనియన్ రిపబ్లిక్కు, పల్లెటూళ్ళకొరకు 34 నీటిసరఫరా కేంద్రాలు తెరచింది. దాఘేస్థాన్ ఆటానమస్ రిపబ్లిక్కు ఇటువంటివి 138 నిర్మించింది. ఇంకా 23 కట్టబడుతున్నాయి. విప్లవాత్పూర్వం యీ రిపబ్లిక్కులో ఒక్కటికూడా నీటిగొట్టం వుండేదికాదు.

సోవియటు పరిపాలనలో యెన్నోపట్టణాల్లో వేలకొలది కొత్త భవనాలు నిర్మింపబడ్డాయి.

ఆహారపదార్థాల వుత్పత్తికూడ జారిస్టు రష్యాలోకన్న యించుమించు 6 రెట్లు యెక్కువైంది. 1938 లో 1,480 కోట్ల రూబుల్సు విలువగల ఆహారపదార్థాలమ్మబడ్డాయి. వాటిల్లోనూ, బలకరమైన పదార్థాలెక్కువగా పండింపబడుతున్నాయి.

1937 లో సగటున పౌరుని ఆహారంలోని ఐటముల వృద్ధిక్రమం.

(1932=100.)

| పదార్థం. | | నూటికి. |
|---|---|---|
| నల్లరొట్టె | .... | 71·0 తగ్గింది. |
| గోధుమరొట్టె | .... | 176·7 హెచ్చింది. |
| ఇతర మంచిరకం రొట్టెలు | | 125·8 ,, |
| పళ్లు - బెర్రీస్ | .... | 316·2 ,, |
| మంచిరకాల మాంసాలు | | 490·0 ,, |
| వెన్న | .... | 301·6 ,, |
| గుడ్లు | .... | 208·4 ,, |

ప్రతివానికీ మునుపటికన్న బలకరమైన, ఆరోగ్యకరమైన ఆహారం యివ్వబడుతూందన్నమాట. ఆల్బుమిన్స్ సగటున మనిషికి 100 గ్రాములు యిస్తారు. జర్మనీలో 35—40 గ్రాములు మాత్రమే.

సోవియటు యూనియనులో దరహంమీద రోజూ 2 కోట్లమంది పబ్లిక్ భోజనశాలల్ని వుపయోగిస్తుంటారు. రెస్టురాంట్లు, హోటల్సుకూ మంచి ఆరోగ్యకరమైన రకరకాల భోజనపదార్థాల పట్టీలు యేర్పరచేరు. వాటిని అనుసరించే అక్కడి పదార్థాలూ, భోజనం అమర్చుతారు.

దేశం మొత్తంమీద కార్మికుల, ఉద్యోగుల జీతాల బట్వాడా మొత్తం 1933 లో 3,495 కోట్లనుంచి 1938 కి 9,642 కోట్ల రూబుల్సుకు పెరిగింది.

అన్నివిధములైన వైద్యసహాయమూ ప్రతి పౌరునికీ వుచితంగా చేయబడుతుంది. వైద్యశాస్త్రంలోని ఆధునికపద్ధతులూ, పరికరాలన్నీ కూడ సోవియటుపౌరుల రోగనివారణ కుపయోగింపబడుతున్నాయి. శాని టోరియం చికిత్స, జల, వాయు, కిరణచికిత్సాపద్ధతులూ, వేదనలేకుండ గనే ప్రసవమయే పద్ధతులు, ఇంకా అనేక శాస్త్రీయసౌకర్యాలు ప్రజ లందరికీ లభ్యంచేస్తున్నారు.

పిల్లవాడు పుట్టగానే ఛైల్డు వెల్ఫేరు (శిశుభద్రతాకేంద్రం) సెంట రులో రిజిష్టరు చేస్తారు. ఆ సంస్థకు సంబంధించిన డాక్టరు ఆ బిడ్డయొక్క ఆరోగ్యాన్ని అతిశ్రద్ధగాచూస్తాడు. తల్లికి బిడ్డపోషణవిషయంలో సలహా యిస్తూంటాడు. ఏదైనా అస్వస్థతవొస్తే పిల్లల వైద్యశాలలో చికిత్స చేస్తారు. వెల్ఫేరుకు సంబంధించిన డాక్టర్లు, నర్సులు పిల్లవానియింటికివచ్చి కూడా అతడి ఆరోగ్యపరిస్థితిని కనుక్కుపోతూంటారు.

ఇటువంటి "ఛైల్డు మెటర్నిటీ వెల్ఫేరు సెంటర్లు" జారిస్టు రష్యా అంతలోనూ 9 మాత్రమే వుండేవి. నేడు సోవియటు యూనియనులో వీనిసంఖ్య 4,384. ఈ కేంద్రములలోని పిల్లలకు వారివారి ఆరోగ్యస్థితిని బట్టి ప్రత్యేకాహారం యివ్వబడుతుంది. నర్సరీల్లో ఒకనెలదాటిన పిల్లల్ని చేర్చుకుంటారు. పిల్లల్నిక్కడుంచి తల్లి తన పనిలోకి వెడుతుంది. మధ్య మధ్యవచ్చి పాలిచ్చి పోతూంటుంది. మిగతాఅప్పుడు డాక్టర్లు, నర్సులు ఆ పిల్లలక్షేమం చూస్తూంటారు. పిల్లలకు 3½ సంవత్సరాలు వొచ్చేవరకూ నర్సరీల్లో చేర్చుకుంటారు. ఈ యీడుపిల్లల్లో సామాన్యంగా జబ్బులు. అంటువ్యాధులు యెక్కువ. వాటినుండి పిల్లల్ని కాపాడ్డానికి యెంతోమంది డాక్టర్లు, నర్సులు-- ఆరోగ్యశాఖా మంత్రివర్గంయొక్క పర్యవేక్షణక్రింద పనిచేస్తూంటారు.

3½ యేళ్ళు దాటినపిల్లల్ని 'కిండర్ గార్డెన్సు'లో చేర్చుకుంటారు. మాతా శిశువుల ఆరోగ్యరక్షణకు ప్రభుత్వం చేస్తూన్నవ్యయం ఒకయేటి కన్న మరోయేడు ఎన్నోరెట్లు పెరుగుతూంది.

'మెటర్నిటీ వెల్ఫేరు సెంటర్ల'లో గర్భిణీస్త్రీలకు తగిన సలహాలూ, వైద్యసహాయమూ ప్రభుత్వ ఖర్చుతో యివ్వబడతాయి. పురిటిరోజులు దగ్గరకొచ్చినపుడు వారిని ప్రసూతి వైద్యశాలలకు పంపుతారు. 1937 లో యీ మెటర్నిటీ హాస్పిటల్సులో 1,20,000 పురిటి మంచాలున్నాయి; జారిస్టు రష్యాలో 6,824 మాత్రం వుండేవి. ప్రసూతి శాస్త్రంలో ప్రత్యేక కృషిని పెంపొందించుటకు యెంతోధనం ఖర్చుపెడుతూంది, ప్రభుత్వం.

1936 శాసనం ప్రకారం గర్భస్రావం చేసికొనుట నిషేధింపబడింది. స్త్రీ ఆరోగ్యానికది అత్యవసరమని డాక్టర్లు నిర్ణయిస్తే ప్రత్యేకానుమతిపొంది వైద్యశాలల్లోమాత్రం చేసుకొనవచ్చు.

దారిద్ర్యం, నిరుద్యోగం నిర్మూలింపబడిన సోషలిస్టు సమాజంలోనే కుటుంబబాధ్యతలను సరిగా నిర్వర్తించేలా చేయడం, గర్భస్రావం చేసికోడాన్ని నిషేధించడమూ జయప్రదంగా జరిగేయి. ఎవరికీకూడా భావినిగురించి చింతలేదు; అందుచేత పిల్లలుండడం ఒక భారంగా యెవరూ పరిగణించరు.

పెద్ద కుటుంబాల తల్లులకు ప్రభుత్వం విరాళాల రూపంలో యెంతో ధనసహాయం చేస్తూంది.

పిల్లలకు పోలిక్లినిక్స్ (వివిధ వైద్యశాఖలన్నీవుండే చికిత్సాలయాల) హాస్పిటల్సులో వైద్యసహాయం చేయబడుతుంది. ఈమధ్యనే మాస్కోలోని "ఛిల్డ్రెన్స్ పోలిక్లినిక్" ఇరవయ్యో వార్షికోత్సవం జరిగింది. ఇపుడందులో 70 మంది వైద్యులు, స్పెషలిస్టులు వున్నారు. రోజూ 5, 6 వందలమందిని అందులోకి తీసికుంటారు. దానికి ప్రత్యేక లేబరేటరీలు, శానటోరియము, ఇతర మెడికల్ డిపార్టుమెంట్సు వున్నాయి. పిల్లలు పగలల్లా అక్కడవుంటారు. రాత్రిళ్ళు యిళ్ళకు వెళ్ళిపోతారు. యేడాదికోమారు కుర్రవాళ్ళందరిన్నీ పరీక్షచేసి, శానటోరియములకు, రెస్టుహోమ్సుకు పంపబడవలసినఅవసరం వున్నవాళ్ళని యేరి పంపుతారు.

వారికి ఆరోగ్యం కలిగేవరకూ వాటిలో వుంచుతారు. 1938 లో యీ విధంగా 4 లక్షలమంది చికిత్సపొందేరు.

కుర్రవాళ్ళ ఆరోగ్యంవిషయంలో ప్రభుత్వం తీసికుంటూన్న శ్రద్ధకు, సోవియట్ యూనియన్‌లోని కార్మికచట్టాలు (లేబర్ లెజిస్లేషన్) కూడ ఒక ప్రత్యక్ష నిదర్శనం. 14 యేళ్ల లోపువారు యేవిధమైన కూలి పనీ చేయనేకూడదు. పెద్దవాళ్ళకుకూడా వారి ఆరోగ్యానికి తగిన పనినే యిస్తారు.

మాతా శిశువుల ఆరోగ్యాభివృద్ధి విషయంలో ప్రభుత్వం తీసికొన్న శ్రద్ధా, చేసినవ్యయమూ పూరికేపోలేదు. శిశుమరణాలసంఖ్య వెనకటి కంటె సగానికి సగం తగ్గిపోయింది. సోవియటు బాలురు ఒడ్డూ పొడుగులో, బలంలో చాల అభివృద్ధి కనపరుస్తున్నారు.

పరిశ్రమల్లో అపాయాలను తగ్గించడానికి యెంతో కార్యదీక్షతో పనిచేస్తున్నారు. శ్రామికుల ఆయురారోగ్యాలను కాపాడ్డంలో యిదొక ముఖ్యాంశం. ఈ అపాయాలను నిరోధించుటకు, ఆ విషయంలో తగిన కృషి చేయుటకు యెన్నో ప్రత్యేకసంస్థలు స్థాపింపబడినై. తనంతట తానే పనిచేసికొనుపోవు ఆటోమాటిక్ మెషినరీ అన్ని పరిశ్రమల్లోనూ వుపయోగింపబడుతూంది. రక్షణావకాశాలు ప్రతి ఫాక్టరీలోను కల్పింపబడుతున్నాయి. మొత్తానికివన్నీ కలిసి ప్రమాదాలసంఖ్యను చాల తగ్గించేయి. ప్రతి ఫాక్టరీకి, సమిష్టిక్షేత్రానికి అనుబంధంగా ప్రథమ చికిత్సాలయా లుంటాయి; వెంటనే అవసరమైతే పెద్ద హాస్పిటల్సులో చికిత్స యివ్వబడుతుంది. అందుచే ఒకవేళ అపాయానికి లోబడినా వెనుకటిమల్లే ప్రాణాలుకోల్పోవడం, శాశ్వతంగా అశక్తులైపోవడం చాలా అరుదుగా సంభవిస్తుంది.

సోవియటు యూనియనులోవున్న 7,631 హెల్తుస్టేషన్సూ, ఫాక్టరీల, పరిశ్రమల శానిటేషను, శ్రామికుల ఆరోగ్యం మొదలైనవాటి విష

యములో చాల శ్రద్ధవహిస్తున్నాయి. ప్రత్యేకచికిత్స లవసరం అయిన వాళ్ళని డిస్పెన్సరీలకు, పోలిక్లినిక్సుకు పంపిస్తారు. అక్కడ, అన్ని వైద్యశాఖల్లోనూ స్పెషలిస్టులు, ఎక్సరే వగైరా నూతన సాధనాలతో వారికి చికిత్స చేస్తారు. ఈ పోలిక్లినిక్సుయొక్క సంఖ్య వెనుకటికంటె యించుమించు పదిరెట్లు పెరిగింది. కొన్ని పోలిక్లినిక్సులో రోజుకి 1000-4000 మంది వరకూ చికిత్స పొందుతారు. మాస్కో సెంట్రల్ రైలు రోడ్ వర్కర్స్ పోలిక్లినిక్‌లో 1000 మంది వుద్యోగులున్నారు. అందులో 400 మంది డాక్టర్లున్నారు. ఒక జిల్లా పోలిక్లినిక్ వుందను కోండి. అందులోని ప్రతి డాక్టరుకీ, కొంతనిర్ణీతప్రదేశం వొప్పజెపుతారు. ఆ యేరియాలోని ప్రజల ఆరోగ్యవిషయాలన్నీ అతడు చూస్తూంటాడన్న మాట. రోగులికి హాస్పిటల్లో చికిత్సచేయడం, అవసరం అయినప్పుడల్లా వారియిళ్ళకు వెళ్ళడం వుంటుంది. వెనుకటి రోజుల్లోని ప్రైవేటు డాక్టరుకూ, యితనికీ యెంతో తేడావుంది. ఇతడి అధీనంలో ఎక్సరే మొదలైన అధునాతన చికిత్సాపరికరాలన్నీ వుంటాయి. ఎంతోమంది స్పెషలిస్టుల సహాయం వుంటుంది. ఏ చికిత్స కావాలంటే ఆ స్పెషలిస్టుయొక్క సహాయం తీసుకోబడుతుంది. అనేక కారణాలచేత జారిస్టు రష్యాలో ప్రజాసామాన్యంలో క్షయ, సుఖవ్యాధులు చాల యెక్కువగావ్యాపించేయి. దారిద్ర్యం, అనారోగ్యకరమైన నివాసస్థానాలు, అజ్ఞానం-ఇవే ఆ కారణాలు. వైద్యులు యీవ్యాధుల్ని నిర్మూలించలేకపోయేవారు. ఎంచేతంటే, ఆ మూలకారణాలను తొలగించనంతవరకూ పై వైద్యాల వుపయోగమేమీ వుండదు. దారిద్ర్యం, నిరుద్యోగం, అనారోగ్యపరిస్థితులు, అజ్ఞానం వీటిని తొలగించడంమూలంగా వైద్యులపని సులువైంది. సుఖవ్యాధులను కుదిర్చే స్పెషలిస్టులు 5,000 మంది తమ సంస్థలద్వారా యీ వ్యాధులను తగ్గించడానికెంతో కృషిచేస్తున్నారు. ఆపని చాలమటుకు ఫలప్రదమైంది కూడాను. జారిస్టు రష్యాలోవున్నదానిలో పదోవంతు ఉన్నారు నేడు సుఖరోగులు. ఆరోజుల్లో వ్యభిచారం మహాయెక్కువగా వుండడంచేత యీ

రోగం అతివ్యాప్తి చెందింది. నిరుద్యోగం, దారిద్ర్యం పోవడంతో వ్యభిచారం చాలవరకు పోయింది. అంటే, సుఖవ్యాధులు వ్యాపించడానికి అవకాశాలు తగ్గేయన్నమాట. 1935 లో రెడ్ ఆర్మీలో చేరిన యువకుల్లో ఒకనికికూడా సిఫిలిస్‌వ్యాధి లేదని తేలింది. ఇంగ్లండు, అమెరికా మొదలైన దేశాల్లో, ముఖ్యంగా సైనికుల్లో—యీ వ్యాధులు యెంతో యెక్కువగా వున్నాయి.

క్షయవ్యాధి నిర్మూలనంలోకూడ సోవియటు ఆరోగ్యశాఖ చాల కృషిచేసింది. ఈ ఇరవైయేళ్ళలో క్షయవ్యాధి బాధితులసంఖ్య 100 కి 83 పాళ్లు తగ్గింది. క్షయవ్యాధి రాకుండాచేయడానికి యెన్నో డిస్పెన్సరీలు, ఒచ్చేక కుదర్చడానికి శానటోరియములు, ప్రత్యేక వైద్యశాలలు, హెల్తు సెంటర్సు యెన్నో వున్నాయి. చిన్నపిల్లల కీ వ్యాధి రాకుండా చేయడానికి మరీ శ్రద్ధ తీసికోబడుతూంది. పట్టణ హాస్పిటల్సులోని మంచాలసంఖ్య ప్రస్తుతం 3,96,000; జారిస్టు రష్యాలో 89,200 మాత్రమే వుండేవి.

వెనకటి రోజుల్లో అజ్ఞానంలో మునిగియున్న పల్లెల్లోనూ, వలస దేశాల్లోనూ యెందరో కుహనావైద్యులు, మంత్రవైద్యులు, భూతవైద్యులు ప్రజలను మోసంచేసి, జీవనం గడిపేవారు. నేడు టర్కోమన్ రిపబ్లిక్కులోని హాస్పిటల్సులో 3,000 మంచాలున్నాయి; యెంతోమంది శాస్త్రీయవైద్యులు, వివిధ ప్రజారోగ్య సంస్థలు పనిచేస్తున్నాయి.

సోవియటు హాస్పిటల్సు సంఖ్యలోనేకాదు అభివృద్ధిచెందింది. వాటిలోవున్న వైద్యుల విజ్ఞానసామర్థ్యాల్లో, అధునాతన పరికరాల్లో, ప్రత్యేకచికిత్సలు యివ్వడంలో యెంతోయెక్కువగా అభివృద్ధిపొందింది. ప్రతి హాస్పిటల్లో సమర్థులైన వైద్యులు, నర్సులు వుంటారు. అవసరమైతే యితర స్పెషలిస్టుల సహాయం యెప్పుడూ దొరుకుతుంది. రోగులకు తగిన ఆహారంకూడా యిక్కడే యిస్తారు.

జెర్జి నెస్కీ టెక్స్టయిల్ మిల్లు మాస్కోలోని పెద్దఫాక్టరీల్లో ఒకటి. వెనుక అది ప్రొఖొరోవ్ అనే ధనికుని చేతిలో వుండేది. ఆరోజుల్లో కూడా దానికొక హాస్పిటలు వుండేది. కాని, అందులో మంచాలు తక్కువ; ఒక్కడే డాక్టరు; మంచి చికిత్స జరుగుతుందనేనమ్మకంలేదు. అంచేత హాస్పిటలుకూలీల కంతయెక్కువ వుపయోగించేదికాదు. —నేడు యీ హాస్పిటలుకోసం యేటా 10 లక్షలరూబుల్సు ఖర్చుచేస్తు న్నారు. కూలీలయొక్క, వారి కుటుంబాలయొక్క వైద్యసహాయంకోసం హాస్పిటల్లో 100 మంది నేర్పరులైన వైద్యులు, ప్రొఫెసర్లు వున్నారు. వైద్యసలహా యెవరికైనా వుచితంగా యిస్తారు, ప్రఖ్యాత స్పెషలిస్టులు. ఈ హాస్పిటలుకొక పెద్ద లేబరేటరీ, మెటర్నిటీవార్డు, ఎక్సురే డిపార్టు మెంటు, ఫిజియాలాజికల్ అండ్ సైకాలజీ డిపార్టుమెంట్లు (శరీర, మన స్తత్వశాస్త్ర శాఖలు) వున్నాయి.

ఇంకోవుదాహరణ; పెద్ద పారిశ్రామిక కేంద్రమైన 'ఓరికోవో-జూవో'లో ముగ్గురువైద్యులతో రెండు హాస్పిటల్సు వుండేవి జారు ప్రభుత్వకాలంలో. నేడక్కడ 50 మంది డాక్టర్లు 1000 హాస్పిటలుబెడ్సు వున్నాయి.

జారిస్టు కాలంలో పల్లెటూళ్ళలో మంచిడాక్టరే కన్పించేవాడుకాడు. మంత్రవైద్యులు, యేమీతెలియని మంత్రసానులుమాత్రమే పల్లెటిప్రజలకు ఆధారం. వారి సలహా, సహాయం యెంత శాస్త్రీయంగా, సమృద్ధంగా వుంటాయో వేరే అడక్కర్లేదు,

నేడు ప్రతి జిల్లాలోను మెడికల్ సెంటర్లు స్థాపింపబడినై. వాటికి తోడుగా హాస్పిటల్సు, క్లినిక్సు, శానటోరియములు, మెటర్నిటీ హాస్పి టల్సు—ఒకటేమిటి? వివిధరోగాలను కుదర్చడానికి స్పెషలిస్టులతో అనేక డిపార్టుమెంటల్ హాస్పిటల్సున్నాయి. పట్టణాల్లో పోలిక్లినిక్సు, హాస్పిటల్సు వుంటాయి.

1937 లో పల్లెటిప్రాంతాల్లో 1,75,955 హాస్పిటల్ బెడ్సున్నాయి; 1913 లో వాటిసంఖ్య 49,423 మాత్రమే; నేడు సోవియటు మెటర్నిటీ హాస్పిటల్సులో ఒక్కమారుగా 54,317 గురు స్త్రీలు పురుడు పోసికొనేందుకు అవకాశాలన్నీ వున్నాయి. వెనకటిరోజుల్లో 4,611 మందికి మాత్రమే అవకాశం వుండేది. పల్లెటూళ్ళలో నేడు 1,626 మాతా శిశు పరామర్శన కేంద్రాలు (మెటర్నిటీ వెల్ఫేర్ సెంటర్లు) న్నాయి. 1913 కి ముందు ఒక్కటికూడా లేదు. 1937 లో రెగ్యులర్ నర్సరీల్లో 3,70,000 పిల్లలూ, తాత్కాలికంగా యేర్పాటుచేసే (సీజనల్) నర్సరీల్లో 35,00,000 పిల్లలూ వున్నారు.

అత్యవసరమైనపుడు యీ పల్లెటిప్రాంతాలకు పట్టణ హాస్పిటల్సు మండి గొప్ప డాక్టర్లను అక్కడివారి సహాయంకోసం విమానాల్లోకూడా పంపుతూంటారు. పల్లెటూళ్ళ హాస్పిటల్సులోకి సమర్థులైన డాక్టర్ల నాకర్షించుటకుగాను ప్రభుత్వం వారికి యెక్కువ జీతాలిస్తుంది; యింకా యేన్నో యితరసౌకర్యాలిస్తుంది; మూడేళ్ళకోమాటు మెడికల్ ఇన్స్టిట్యూట్సుకు పంపి నాలుగైదునెలలు ప్రత్యేకశిక్షణ యిప్పిస్తారు. ఈ విధంగా పల్లెటూరి ప్రజలకుకూడ సమర్థులైన డాక్టర్లసహాయం యెప్పుడూ వూరికే దొరుకుతూంది.

ఆరోగ్యకేంద్రాల్లో లక్షలకొలదిప్రజలు తమఆరోగ్యాన్ని పెంపొందించుకొనేందుకుగాను చేరుతూంటారు. 1937 లో 5 లక్షలమందికి పైగా శానటోరియములలో చికిత్సపొందేరు. ఏటా 20 లక్షలమంది పైగా తమ సెలవుదినాలను రెస్టు హోమ్సులో గడుపుతారు.

జారిస్టు కాలంలో ఆరోగ్యసదనాలు ధనికులు, జమీందార్లకే వుపయోగించేవి. బీదవాళ్ళకి అందులోకి ప్రవేశమే దుర్లభం. నేడు శానటోరియములలో ఒక్కసారిగా 80,000 మందికి అవకాశంవుంది. కార్మికులూ, సమిష్టిరైతులూ, అందరూ అందులో చికిత్స పొందవచ్చును.

పాత ఆరోగ్యకేంద్రాలను పూర్తిగా కొత్తపద్ధతులమీద పునర్నిర్మించేరు. యెన్నో కొత్తవాటిని కట్టేరు. పాతవాటిలో కొత్తడిపార్టుమెంట్లు యెన్నో తెరిచేరు. సోవియటు యూనియను అంతటా యెన్నో ఆరోగ్యకేంద్రాలు స్థాపింపబడ్డాయి; శానటోరియములు కట్టబడ్డాయి.

ప్రతినిత్యం అభివృద్ధి చెందుతూన్న ప్రజా ఆరోగ్యకృషికి, కొత్తగా కడుతూన్న హాస్పిటల్సు, యెంతమందో మెడికల్‌స్టాఫ్ అవసరం అవుతారు. సోవియటు యూనియనులో నేడు 72 మెడికల్ కాలేజీ లున్నాయి; వాటిలో ఒక లక్షమందిపైగా విద్యార్థులున్నారు. వారిలో చాలామందికి ప్రభుత్వం అలవెన్సులిస్తుంది. ట్యూషన్ ఫీ యెవరికీ లేదు. ప్రజావసరాలు, విద్యార్థి అభిరుచులు మనస్సులోవుంచుకొని విద్య పూర్తి కావడంతోటే యే విద్యార్థి యేప్రాంతంలో పనిచేయవలసియుంటుందో నిర్ణయింపబడుతుంది. ఆరోగ్యశాఖా మంత్రివర్గం, విద్యార్థులతో సంప్రదించి యెవరి కేశాఖలో నిపుణతవుందో ఆపనిలోనే అతన్ని నియోగిస్తారు. ఈ నియామకాలు చేసేటప్పుడు వివిధ రిపబ్లిక్కుల అవసరాలకు కూడ ప్రాముఖ్యత యివ్వబడుతుంది.

నేడు యూనియనులో పనిచేస్తూన్న డాక్టర్లలో 80% సోవియటు ప్రభుత్వకాలంలో వైద్యపరీక్షలు ప్యాసైనవారే.

సోవియటు యూనియనులో డాక్టర్లు, ప్రొఫెసర్లు యెంతో గౌరవంతో చూడబడుతున్నారు. ఎంతోమంది డాక్టర్లు, శాస్త్రజ్ఞులు సోవియటు యూనియను కేంద్ర శాసనసభకూ, రిపబ్లిక్కుల సోవియట్లకూ సభ్యులుగా యెన్నుకోబడ్డారు. సోవియటు యూనియనులో వైద్యశాస్త్రానికి ప్రాక్టీసుకు అవినాభావసంబంధం వుంది. శాస్త్ర పరిశోధనలు చేస్తూంటారు కొందరు. వారి పరిశోధనాఫలితాలు, ప్రాక్టీసుచేస్తూన్న డాక్టర్లు ప్రజారోగ్య రక్షణలో, రోగనివారణలో వుపయోగిస్తారు. పరిశోధన, ప్రాక్టీసు—రెండూ ఒకటే విషయంయొక్క రెండుముఖాలు.

పావ్లోవ్, ఓర్బెలి, రాజెన్‌కోవ్, స్పెరన్‌స్కీ మొదలగువారి పరిశోధనలు ప్రపంచ ప్రసిద్ధములు; శాస్త్ర విజ్ఞానంలో యెంతో అభివృద్ధిని కలిగించేయి. న్యూరో-సర్జరీ (మెదడుకు శస్త్రంచేయుట) లో బుర్దెంకోవ్ గావించిన పరిశోధనలుకూడ చాల ప్రఖ్యాతిచెందేయి.

ప్రొఫెసర్ సార్కిసోవ్, ఒస్సిపోవ్‌ల ఆధిపత్యాన బ్రెన్ ఇన్‌స్టిట్యూటు (మెదడునుగూర్చిన పరిశోధనశాల) యెన్నో పరిశోధనలుచేసి మంచి ఫలితాలను చూపింది.

మాస్కోలోని గోర్కీ వైద్యశాస్త్ర పరిశోధనకళాశాల, సోవియటు యూనియనులోని యిట్టి పరిశోధకసంస్థ లన్నిటిలో చాల పెద్దది. సుప్రసిద్ధ మైనదీని.

వైద్యశాస్త్ర సహాయంతో మానవదేహంయొక్క నిర్మాణాన్నంతనీ అతిసూక్ష్మంగా పరిశీలించడమూ, (బయాలజీ, కెమిస్ట్రీ, ఫిజిక్సుల్లోని ఆధునిక పరిశోధనల సహాయంతో) రోగనిదానంలో నూతన విధానాలనూ, చికిత్సనూ, రోగనివారక సాధనాలనూ కనిపెట్టుటా, లేబరేటరీలకు, క్లినిక్కులకు కొత్త పరికరాలను నిర్మించడం—యివీ యీ సంస్థయొక్క ప్రధానోద్దేశాలు, కార్యక్రమమూను. ఆ సంస్థక్రింద ప్రత్యేకం యెన్నో చికిత్సాశాలలు (క్లినిక్సు) వున్నాయి. 9 కోట్ల రూబుల్సు ఖర్చుతో నీ "గోర్కీ ఇన్‌స్టిట్యూట్"కొరకు ప్రత్యేకభవనం కట్టబడుతూంది.

శాస్త్ర విజ్ఞానాభివృద్ధికొరకు సోవియటు ప్రభుత్వం యెంతో పెద్ద మొత్తాలను ఖర్చు చేస్తుంది. శాస్త్ర పరిశోధనల సహాయంతో సోవియటు ఆరోగ్యకృషి, ఆ ప్రజల ఆరోగ్యాన్నెంతో అభివృద్ధిచేసింది. నిరుద్యోగం, దారిద్ర్యం, అజ్ఞానం, మనోవేదనా నిర్మూలించబడడంవలన ఆరోగ్యశాఖ పని చాల సులభంఅయింది. పైగా, ప్రజలందరూ యీ కార్యక్రమాన్ని జయప్రదంగా కొనసాగించడంలో ప్రభుత్వంతో సహకారం చేస్తున్నారు.

1937 లో మరణాలసంఖ్య 1913 లో కన్న 40% తక్కువ; శిశుమరణాలసంఖ్య సగానికిసగం తగ్గిపోయింది. 20 సంవత్సరాల సోవియటు పరిపాలనలో. జననసంఖ్య క్రమంగా యెక్కువౌతూంది. 1937 లో శిశుజననాలు 1936 లో కన్న 18% యెక్కువయేయి. మాస్కో జనాభా 1937 లో నూటికి 20 వంతున యెక్కువైంది. (1913 లో 9·1 మాత్రమే యెక్కువైంది.) లెనిన్‌గ్రాడ్‌లో జనాభా అభివృద్ధి 1913 లో నూటికి 5·3; 1937 లో ఆ అభివృద్ధి 18·6;—

## సోవియట్ యూనియనులో అభివృద్ధి.

| | 1913 | 1941 |
|---|---|---|
| పట్టణ హాస్పిటల్స్ | 1,230 | 13,461 |
| క్షయ హాస్పిటల్స్ | 43 | 1,048 |
| హాస్పిటల్సులోని బెడ్స్ మొత్తం | 1,75,690 | 7,72,727 |
| డాక్టర్ల విజిట్సు మొత్తం | 3,91,400 | 2,93,71,100 |
| మాతాశిశు కేంద్రాలు | 9 | 3,491 |
| పట్టణ క్రెచీల్లో పిల్లలు | 530 | 5,54,449 |
| ప్రసూతిహాస్పిటల్సు మంచాలు | 5,192 | 73,612 |
| డాక్టర్లు | 17,785 | 1,30,000 |
| కాంపౌండర్లు, నర్సులు మొ॥ | 41,390 | 4,60,000 |
| మెడికల్ స్కూల్సు | 13 | 72 |
| వైద్య విద్యార్థులు | 19,000 | 1,30,000 |
| మందుల దుకాణాలు | 4,700 | 9,832 |
| మందులు, పరికరాలు | ఉత్పత్తి చాలతక్కువ. | 65 కోట్ల రూబుల్సు |

# విద్యావిధానం

టాల్‌స్టాయి, చెకోవ్‌ల కాలంనుండీ కూడా రష్యన్ బడిపంతులు నిగర్విగా ప్రజలను విద్యావంతులజేయుటే ఆశయంగా గల ప్రజాసేవకుడుగా చిత్రింపబడ్డాడు. దారిద్ర్యం, బాధాసహనం అతని నిత్యజీవితంలోని ఘట్టాలు జీతం సరిగా ఓపూటతిండికేనా చాలదు. ప్రభుత్వంతో సంబంధం వున్న ప్రతివాడూ అతని మీద అధికారం చెలాయించే వాడే.

ఇక పాఠశాల సంగతి. దానికో ఫలానాయిల్లు అనేదిలేదు. ఏపూరి గుడిసెలోనో పిల్లల్నందర్నీ పోగుచేసేవారు. చుట్టుప్రక్కల ఏడెనిమిది మైళ్లలో ఒకటే స్కూలు. దానికి సరియైన రోడ్లు వుండవు. బురదలో, మంచులో నడిచి పోవలసిందే స్కూలుకి. పోనీ యిన్నింటికీ ఒడబడి చదువుకుందామనుకున్నా ఆర్థికంగా అవకాశాలున్న అదృష్టవంతులు చాల తక్కువమంది వుండేవారు.

జారిస్టు రష్యాలో యించుమించు నూటికి తొంభైమంది నిరక్షరాస్యులే. ప్రతి 1000 మందికీ 50 మాత్రమే బడికి పోయేవారు. 1913 లో ప్రభుత్వం విద్యాశాఖమీద ఖర్చుపెట్టిన మొత్తం 13·67 కోట్ల రూబుల్సు; అంటే సగటున తలకు 80 కోపెక్కులన్నమాట. అదే కాలంలో ఇంగ్లాండు తలకు 3 రూబుల్సు, అమెరికా సంయుక్తరాష్ట్రాలు 9 రూబుల్సూ విద్యకొరకు ఖర్చుపెట్టేయి.

బీదకుటుంబాల్లో పుట్టినవాళ్లకి చదువుకునే అవకాశా లతిస్వల్పం. అతి బీదరికంలో జన్మించినా స్వశక్తిచేత పైకివచ్చి, తమ విశ్వవిఖ్యాత రచనలచే ప్రపంచసాహిత్యానికే మెరుగులు దిద్దిన మాగ్జిమ్ గోర్కీ, తారాస్ షెవ్చెంకో. విజ్ఞానశాస్త్రజ్ఞుడు మైఖేల్ లొమొనొసోవ్‌లు అసాధారణ మేధాశక్తి సంపన్నులవడం చేతనే యిన్ని కష్టపరిస్థితులనూ యెదు

ర్కొని నెగ్గుకు రాగలిగేరు. కాని అటువంటి వాళ్లు చాల తక్కువమంది వుంటారు. ప్రజాసామాన్యం అజ్ఞానంలో వుండిపోవలసి వచ్చింది.

1914—18 ప్రపంచయుద్ధకాలంలో రష్యన్ ఆర్థికవ్యవస్థ కూలి పోవడం, ప్రజల ఘోరదారిద్ర్యం కారణంగా అనేకస్కూల్సు మూసి వేయ బడ్డాయి; బడిపిల్లల సంఖ్యకూడ చాల తగ్గిపోయింది.

విప్లవానంతరం యెన్నో కఠినపరిస్థితు లెదుర్కొన్న నిరాశాపరి స్థితుల్లోకూడా, సోవియటు ప్రభుత్వం తన దృష్టిని ప్రజల్లో విద్యావ్యాప్తి చేయడం మీదనే కేంద్రీకరించింది. కూలిపోతూన్న వెకనటి కొంప ల్లోంచి స్కూళ్లను పెద్దవిశాలమైన భవనాల్లోకి మార్చేరు. స్కూల్సు, నర్సరీలు, కిండర్‌గార్టెన్సుయొక్క వుపయోగార్థం మంచి భవనాల నిచ్చి వేస్తూ ప్రభుత్వ ప్రకటన చేయబడింది. పాఠశాలల సంఖ్య యెంతో యెక్కువ చేయబడింది. అక్టోబరు విప్లవం, జాతీయబానిసత్వవిధానాన్ని నిర్మూలించడమేకాక, వివిధజాతుల విద్యార్జనమార్గంలో విధింపబడిన ఆటంకాలన్నిటినీ తొలగించింది. యూదులపై నిషేధాలూ, జాతీయపాఠ శాలలపై విధింపబడిన నిషేధాలూ వెంటనే రద్దుచేయబడ్డాయి. సోవి యటు యూనియనులోని ప్రతి బాలుడూ తన మాతృబాషలో చదువు నేర్చుకొనే అవకాశాలు కల్పింపబడినై.

వయోజననిరక్షరాస్యతా నిర్మూలనోద్యమం దేశమంతటా పెద్ద యెత్తున ప్రారంభింపబడింది. లక్షలకొలది ప్రజలు యెంతో వుత్సా హంతో చదువు నేర్చుకున్నారు. తమజీవితంలో మొదటి సారిగా (30 వ ఏటనో, 40 వ యేటనో) చదువనూ, వ్రాయనూ నేర్చుకొన్నపుడు వారు పొందిన అవ్యక్తానందము నేనెన్నటికీ మరిచిపోలేను.

20 సంవత్సరాల సోవియటు పరిపాలనలో 4 కోట్ల పెద్దవాళ్లు చదువు నేర్చుకున్నారు కొత్తగా. నిరక్షరాస్యత 100 కి 90 పాళ్ళు నిర్మూలింపబడింది.

1920 నుండీ సోవియటు ప్రభుత్వం ప్రజల విద్యాభివృద్ధి విషయంలో మెక్కువ శ్రద్ధతీసికోసాగింది. యూనియనులో వివిధజాతులు అనేకభాషలు వుండడంవలన అనేక చిక్కుసమస్య లేర్పడ్డాయి. కొన్ని జాతుల భాషలకు లిపిగాని, స్కూల్సుగాని, టీచర్లుగాని లేనేలేరు. అటువంటి పరిస్థితుల్లో విద్యాసంస్కరణలు ఓనమాలదగ్గర్నుంచీ ప్రారంభించవలసి వచ్చింది.

జారుప్రభుత్వ కాలంలో విద్యామంత్రుల్లో ఒకడు, "ఇరవయ్యో శతాబ్దాంతంలోగా రష్యాలో నిర్బంధప్రాథమిక విద్య ప్రవేశపెట్టడం అసాధ్యమ"ని నిస్సంశయంగా చెప్పేడు. కాని అది అతి స్వల్పం కాలంలోనే సాధ్యమౌతుందని సోవియటు ప్రభుత్వం కార్యరంగంలో చూపించింది. దేశం ఆర్థికంగానూ, పారిశ్రామికంగాను పొందిన అభివృద్ధి, ప్రజల విజ్ఞానాభివృద్ధిలో ప్రభుత్వం కన్పరిచిన అకుంఠిత కార్యదీక్ష—వీటివలన 1931 నాటికే దేశం అంతటా నిర్బంధప్రాథమికవిద్య ప్రవేశపెట్టడానికి సాధ్యమైంది.

విద్యార్థుల సంఖ్యనుబట్టీ, విద్యకొరకు ప్రభుత్వం ఖర్చుచేస్తూన్న ధనాన్నిబట్టీ కూడా సోవియటు యూనియను యెంత త్వరలో యెంత అభివృద్ధి చెందిందో తెలిసికోవచ్చు.

1914 లో జారిస్టు రష్యాలో విద్యార్థుల సంఖ్య 81,37,000 మాత్రమే. 1938—39 లో సోవియటు రష్యాలో విద్యార్థుల సంఖ్య 4,74,42,100 ఇందులో ప్రత్యేకరాత్రి పాఠశాలలకు పోయేవారి సంఖ్య కూడ కలిసివుంది. 1914 లో సెకండరీ స్కూలు విద్యార్థుల సంఖ్య 9,95,000 మాత్రమే. 1938—39 లో వారిసంఖ్య 1,20,76,000; యూనివర్సిటీ విద్యార్థుల సంఖ్య 1914 లో 1,12,000 ; వారి సంఖ్య 1938—39 లో 6,01,000 ; జారుప్రభుత్వం 200 సంవత్సరాల్లో కట్టినకంటె యెక్కువ స్కూళ్లను సోవియటు ప్రభుత్వం ఇరవై

యేళ్ళలో కట్టించింది. 1933—38 మధ్య కాలంలో 20,607 స్కూల్సు నిర్మింపబడినై. ఉచిత విద్యావిధానం, కాలేజీ విద్యార్థులకు ఉపకారవేతనాలుకూడా యివ్వబడుతున్నాయి. విద్యాశాఖమీద ప్రభుత్వవ్యయం నిత్యం అభివృద్ధి చెందుతూనేవుంది. ఒక్క 1937 లోనే వాళ్ళకొరకు 6 179 కోట్ల రూబుల్సు ప్రత్యేకింపబడినాయి.

సోవియటుభూమిలో విద్యార్థులేవిధమైన జీతములూ యివ్వనక్కర లేదు. ప్రతి విద్యాశాలలోనూ బోధనమంతయు ఉచితమే. అంతేగాదు. విద్యార్థులకు నివసించుటకు హాస్టల్సు, భోజనసదుపాయాలు ప్రభుత్వమూ, వివిధ ప్రభుత్వసంస్థలూ యిస్తాయి. కాలేజీ, యూనివర్సిటీ విద్యార్థుల్లో అత్యధికసంఖ్యాకులకు ప్రభుత్వమే "స్టైపెండ్సు" యిస్తుంది 1940 నుంచీ సెకండరీ స్కూళ్ళలోని పై 3 తరగతుల విద్యార్థులకు (15, 16, 17 సం॥ల విద్యార్థులు) కూడా యీ స్టైపెండ్ యివ్వబడుతూంది. తల్లిదండ్రులు లేని పిల్లలూ, తక్కువ జీతాలు సంపాదించేవారి పిల్లలూ ప్రత్యేక స్టైపెండ్లను పొందుతారు. మొదటి తరగతినుంచీ చదువుకొనేవారి కందరకీ యెట్లాటి విచక్షణా చేయకయే ఉపకారవేతనాల (స్టైపెండ్) నిచ్చుటకు తీవ్రప్రయత్నాలు సోవియటు ప్రభుత్వం చేస్తుంది.

మూడవ పంచవర్షప్రణాళిక ప్రకారం (1938—42) పట్టణాల్లో సెకండరీ విద్యనూ, దేశమంతటా జూనియర్ హైస్కూలు విద్యనూ (ఏడవతరగతి వరకూ) నిర్బంధం చేయడానికీ, కాలేజీ విద్యార్థుల సంఖ్యను 1942 నాటికి 6,01,000 నుండి 6,50,000 వరకూ పెంచుటకూ తగిన యేర్పాట్లు చేయబడినై.

1942 ఆఖరికి పట్టణాల్లోనూ, కార్మికకేంద్రాల్లోనూ, ఎలిమెంటరీ, సెకండరీ స్కూలు విద్యార్థుల సంఖ్య 86 లక్షలనుండి 124 లక్షల వర

కూనూ, పల్లెటిప్రాంతాల్లో 208 లక్షలనుండి 277 లక్షల వరకూను పెరగాలి; మొత్తం ఎలిమెంటరీ, సెకండరీ స్కూలు విద్యార్థుల సంఖ్య 4 కోట్లు దాటాలి.

మూడో పంచవర్ష ప్రణాళిక కాలంలో ఐదారు లక్షల వుపాధ్యాయులకు శిక్షణ నిచ్చి తయారు చేయుటకూ, వేలకొలదీ కొత్తస్కూళ్ళను తెరుచుటకూ స్కీము వేయబడింది.

జారిస్టు ప్రభుత్వం నేషనల్ మైనారిటీలను యేహక్కులూలేని పాలితజాతులుగా పరిగణించి వారిపై తన అధికారాన్ని సుస్థిరం చేసుకొనుటకుగాను వారిలో అజ్ఞానాన్ని, అవిద్యను పెంపొందించి, జాతీయ విద్వేషాలను రగుల్కొల్పింది. ఉజ్బెక్‌స్థాన్‌లో తలకు 25 కోపెక్కులు. టర్కొమాన్‌స్తానులో 50 కోపెక్కులు మాత్రమే జారుప్రభుత్వం విద్య కొరకు ఖర్చుపెట్టేదని తెలిసికొంటే, విద్య యెంత నిర్లక్ష్యంగా చూడబడేదో బోధపడుతుంది.

ప్రస్తుతం ఉజ్బెక్‌స్తాన్, టర్కొమన్‌స్తాన్ రిపబ్లిక్కులలో విద్య కొరకు తలకు 40—50 రూబుల్సు ఖర్చుపెడుతూంది సోవియటు ప్రభుత్వం. ఈ రిపబ్లిక్కుల్లో 100 కి 80 మంది పైగా చదువుకొన్నవారే. నేడు అన్ని నేషనల్ రిపబ్లిక్కుల్లోనూ కూడా నిర్బంధప్రాథమిక విద్య అమల్లోవుంది. వీటిల్లో సెకండరీ స్కూలు విద్యార్థుల సంఖ్య 1914 లో కంటె ఇరవైరెట్లు పెరిగింది. విద్యార్థులసంఖ్య 1914 లో కంటె నేడు, అజర్‌బైజానులో 35 రెట్లు—, టర్కొమాన్‌స్తాన్‌లో 37 రెట్లు—, ఉజ్బెక్‌స్తాన్‌లో 53 రెట్లు—, ఆర్మీనియాలో 68 రెట్లు, కిర్ఘీజియాలో (మొత్తం స్కూలు పిల్లల సంఖ్య 500 మాత్రమే వుండేది 1917 కు ముందు) 172 రెట్లు పెరిగింది. విప్లవానికి ముందు తాజిక్‌స్థానులో సెకండరీ స్కూలే లేదు; నేడు సోవియట్ ప్రభుత్వం స్థాపించిన సెకండరీ స్కూళ్ళలో 22,000 కు పైగా విద్యార్థులున్నారు.

జారుప్రభుత్వకాలంలో బీదవాడు వున్నతవిద్యకు రాగలగడం బహు అరుదు. యెన్నో అడ్డంకులు కల్పించింది ప్రభుత్వం. నేడు సోవియటు యూనియనులో ప్రతివాడూ కాలేజీలకు వచ్చి చదువుకునేందుకు యెన్నో అవకాశాలున్నాయి. బీదతనం యేమీ అడ్డంకి కాదు; ప్రభుత్వమే విద్యార్థులకు అలవెన్సు లిస్తుంది. ప్రతి నేషనల్ రిపబ్లికులోను యెన్నో కాలేజీలు, విశ్వవిద్యాలయాలు వున్నాయి. బైలోరష్యాలో 22—; అజర్‌బైజాన్‌లో 13—; ఆర్మీనియాలో 8—; ఉజ్బెక్‌స్తాన్‌లో 30—; టర్కోమన్‌స్తాన్‌లో 5—; కజాక్‌స్తాన్‌లో 19—; కిర్ఘిజియాలో 4 యూనివర్శిటీ లున్నాయి 1917 కు ముందు జార్జియాలో ఒక్కటే యూనివర్శిటీ 300 విద్యార్థులతో—వుండేది. ప్రస్తుతం 18 యూనివర్సిటీల్లో 21,800 విద్యార్థు లున్నారు. యుక్రేనులోని ఉన్నతవిద్యాలయాల సంఖ్య 15 నుండి 139 వరకూ పెరిగింది.

ప్రతిభాషలోనూ గొప్పవాఙ్మయమూ, అనేకపత్రికలూ పెంపొందినాయి. మొత్తం జారిస్టురష్యా అంతకూ 27 లక్షల పాఠకులతో 859 వార్తాపత్రికలు మాత్రమే వుండేవి. 1938 నాటికి సోవియటు రష్యాలో 375 లక్షల చదువరులతో 8,550 పత్రికలు వెలువడుతున్నాయి. పబ్లిక్ లైబ్రరీలసంఖ్య 40,300 (1934) నుండి 70,000 (1939) వరకూను. వాటిలో పుస్తకాల సంఖ్య 8·6 కోట్ల నుండి 12·6 కోట్ల వరకూను పెరిగింది. సోవియటు యూనియనులో 120 భాషల్లో గ్రంథప్రచురణ జరుగుతూంది.

సోవియటు ప్రజల వైజ్ఞానిక, విద్యాభివృద్ధుల విషయంలో సోవియటు స్కూలు టీచరుకు ప్రత్యేక బాధ్యతా, ప్రాముఖ్యతా వున్నాయి. జారిస్టురష్యాలో టీచర్ల సంఖ్య 92 వేలు. నేడు వారిసంఖ్య 10 లక్షలు దాటుతుంది.

19 గురు ఉపాధ్యాయులు సోవియటు కేంద్రశాసనభకు యెన్నుకో బడినారంటే, ఉపాధ్యాయు డెంత గౌరవదృష్టితో చూడబడుతున్నాడో తెలుస్తుంది. రిపబ్లికు సోవియట్లలోకూడ యెందరో ఉపాధ్యాయులు సభ్యులుగా వున్నారు.

తనదేశంతోబాటు సోవియటు స్కూలు టీచరుకూడ యెన్నో కష్ట నిష్ఠూరాలకు ఓర్చి పట్టుదలతో తన ఆదర్శం వైపుకు నడచేడు; అంత ర్యుద్ధపురోజుల్లో గుండుదెబ్బ కెదురునిల్చి పోరాడేడు; ఆర్థికదుస్థితి నుండి తనదేశాన్నుద్ధరించుటకు నడుంకట్టి నిలచేడు, ప్రభుత్వానికి బాసటగా. అందుచేతనే అతడు ప్రభుత్వంచేత, కమ్యూనిస్టుపార్టీచేత, కామ్రేడ్ స్టాలిన్‌చేతనూ యెంతో గౌరవంతో చూడబడుతూ తన దేశం యొక్క పరిపాలనలో ప్రముఖపాత్ర నిర్వహిస్తున్నాడు.

సోవియటు ప్రభుత్వం సోవియటు భావిపౌరుల యెడల వారి బాల్యం నుండి కూడ యెంతో శ్రద్ధ కన్పరుస్తూంది. కిండర్‌గార్టెన్ స్కూల్సులో బాలుర శారీరక మానసికాభివృద్ధికి తగిన శిక్షణ యివ్వబడు తూంది. స్కూల్సుకు హోస్టల్సుకూడా వుండడంచేత దూరప్రదేశాల నుండి కూడా పిల్లలు వచ్చి చదువుకోవచ్చు.

సోవియటు రష్యాలో బిడ్డలతల్లి అంటే ప్రభుత్వం, సంఘం కూడ యెంతో గౌరవాదరాలతో చూస్తాయి. ఆమె ఆరోగ్యానికీ యెంతో శ్రద్ధ చూపబడుతుంది. శిశుజననం ఒక సంతోషకరమైన సంఘటనగా పరిగణింపబడుతుంది. శిశుజననంకి ముందునుండీకూడ మాతాశిశువుల ఆరోగ్యం విషయంలో యెంతో శ్రద్ధతీసుకొంటుంది ప్రభుత్వం. గర్భిణీ స్త్రీలకు విశ్రాంతిగృహాలు, ప్రసూతి వైద్యశాలలు, శిశు ఆరోగ్యకేంద్రాలు, నర్సరీలు, కిండర్‌గార్డెన్సు—ఒకటేమిటి, మాతాశిశువులకు కావలసిన సౌకర్యాలన్నీ కల్పింపబడతాయి.

సోవియటు బోధనాపద్ధతుల్లో వున్న విశిష్టత యేమిటంటే అవి విద్యార్థుల్లోని నిర్మాణశక్తుల్ని, అభిరుచుల్ని కనిపెట్టి వాటి అభివృద్ధికి తగిన సౌకర్యాలు, ప్రోత్సాహము కల్గిస్తాయి. వివిధకళల్లో శాస్త్రాల్లో అభిరుచి కలవారికోసం ప్రత్యేక స్కూల్సున్నాయి.

సోవియటు యూనియనుయొక్క విద్యావిధానంవలన 1937 నాటికి దేశంలోని విద్యార్థికుల సంఖ్య 95,91,000 వరకూ పెరిగింది. యంత్రాలయాల్లో పనివారిలోకూడ యించుమించు అందరూ సెకండరీ విద్యలో వుత్తీర్ణులైనవారే. వారినికూడ కలిపితే యూమేధావి వర్గం సంఖ్య యింకా యెక్కువుంటుంది.

1942 నాటికి శ్రామికవర్గాన్ని విజ్ఞానంలోనూ, శాస్త్రీయపరిజ్ఞానంలోనూ ఇంజనీర్లు, టెక్నీషియన్ల స్టాండర్డుకు తేవడానికి గట్టి ప్రయత్నాలు జరుగుతున్నాయి. సోవియటు ప్రజాసామాన్యం అంతనీ విద్యార్థికులుగా తయారుచేసే మహోద్యమాన్ని ప్రభుత్వం స్టాలిన్ ఆధ్వర్యం క్రింద జయప్రదంగా కొనసాగిస్తూంది.

# నేరాలు - శిక్షలు

అన్నికాలాల్లోనూ ప్రతి సమాజంలోనూ నేరాలు, దుర్మార్గాలు జరుగుతూనే వున్నాయి. వీటికి కారణాలేమిటి? వాటిని తగ్గించడం యెలాగ? అనే సమస్య అనేకమంది న్యాయశాస్త్రజ్ఞుల, ధర్మశాస్త్రజ్ఞుల, తాత్త్వికుల దృష్టి నాకర్షించింది. ఈసమస్యను గురించి ప్రత్యేక కృషి చేసిన పండితులు చివరకో సిద్ధాంతాని కొచ్చేరు. ఆపండితుల్లో ప్రముఖుడైన 'క్వెటిలెట్' యిలా చెప్పేడు, "ప్రతిసమాజంలోనూ నేరాలు జరగడానికి తగిన వాతావరణం సహజంగానే వుంటుంది. మానవుడా ప్రకృతి వాతావరణానికి వుత్త నిమిత్తమాత్రుడు. అందుచేత ప్రతి సమాజంలోనూ కొన్నివిధములైన నేరాలూ, నేరస్థులూ వుండకతప్పదు. అయితే దాన్ని గురించి భయంగాని, సిగ్గుగాని పొందనవసరంలేదు. మానవుని సాంఘిక వ్యవస్థలను, అలవాట్లను, విద్యావిధానాన్ని మార్పుచేసినట్లయితే అతడిని నైతికంగా వుద్ధరించుట సాధ్యమౌతుందని యిది సువ్యక్తం చేస్తుంది."

అయితే అతడు నేరాలకు మూలకారణాలుగాని, వాటిని తొలగించడానికి విధానాలుకాని సరిగా చెప్పలేకపోయేడు. ఆ వ్యవస్థలో, అలవాట్లలో మార్పు యేరీతిగా వొస్తుందో యీపండితులు చూపించలేకపోయేరు. చివరకు నేరాలు జరగడానికివున్న మూలకారణాలు కనుక్కోలేక నేరాలకు విధించవలసిన కఠినశిక్షలను గూర్చి ఆలోచించ సాగేరు. ధర్మశాస్త్రజ్ఞులంతా నేరాలను నిరోధించి నిర్మూలించడానికి శిక్షావిధానమే తిరుగులేని మహామంత్రమని భావించేరు.

కాని కఠినశిక్షావిధానం వలన నేరాలను తగ్గించచూచుట తెలివితక్కువే. ఎన్ని జైళ్ళు నిర్మించినా, యెంత కఠినశిక్షలు విధించినా లాభంలేదు. నేరాలు చేయవలసిన అవసరాన్ని కలిగించిన సామాజిక వ్యవస్థలోని లోటుపాట్లను సవరించిననాడే నేరాలుకూడ తగ్గుతాయి.

ఆకలిబాధచే బాధపడుతూ, కూలికూడా దొరకని బీదవాడు దొంగతనం చేసేడంటే తప్పెవరిది? దారిద్ర్యాన్ని, నిరుద్యోగాన్ని కలిగించిన ఆసామాజిక వ్యవస్థదే తప్పు కాని, ఆనేరస్థునిది కాదు. అట్టినేరాలు తగ్గించాలంటే వాళ్ళను జైళ్ళలో పెట్టడంకాదు మార్గం; వారు నేరం చేయడానికి కారణమైన దారిద్ర్యాన్నీ, నిరుద్యోగాన్నీ, తీరని ఆకలి బాధను తొలగించడమే సరియైన మార్గం.

ఈ రెండిటిలో మొదటి మార్గాన్ని జారిస్టురష్యాలోనూ, నేటికి కూడా అన్ని ధనికవాదదేశాల్లోనూ అనుసరిస్తున్నారు; సోవియటు రష్యా ఆరెండోమార్గాన్ని అనుసరించింది. రెండింటిలో యేమార్గం జయప్రదంగా నేర నిర్మూలనం చేయగలిగిందో చూద్దాం, 'స్టేటిస్టిక్సు' సహాయంతో.

జారిస్టురష్యాలో నేరస్థుల నతికఠినంగా శిక్షించేవారు, అయినా సరే, ఆయేటికాయేడు గడచినకొద్దీ నేరాల సంఖ్య యెక్కువయింది కాని తగ్గలేదు.

1874—94 మధ్య వివిధ నేరాలకుగాను శిక్షితులైనవారి సంఖ్య 60% పైగా యెక్కువైంది. 1899—1908 మధ్య దోపిడీలు, హత్యలకుగాను శిక్షింపబడినవారి సంఖ్య ద్విగుణీకృతమైంది. దొంగతనం, మోసం, ఫోర్జరీల సంఖ్య మరీ యెక్కువైంది. కఠినశిక్షలవలన నేరస్థుల్లో మార్పు కల్గిందనుకోడానికేమీ ఆధారం కన్పడదు. 1908 లో శిక్షింపబడినవారిలో 18% పాతనేరస్థులే. అటువంటి వారి సంఖ్య 1910 లో 21·4%; 1912 నాటికి 23% అయింది. దీనినిబట్టి యెంత కఠినశిక్షలు విధించినా నేరాలు తగ్గలేదని తెలుస్తూనే వుంది.

జారిస్టురష్యాలో కుర్రవాళ్ళలోకూడ యీనైతిక పతనం చాల యెక్కువగా వుండేది. 10—17 యేళ్ళ మధ్యవయసుగల కుర్రనేరస్థుల సంఖ్య 3543 (1901) నుండి 7483 (1910) వరకూ పెరిగింది; పదేళ్ళలోనే. ఈనేరాలను తగ్గించడానికి జారుప్రభుత్వం—యితర ప్రభుత్వాలకి

వలెనే (వారిని సన్మార్గంలో పెట్టే వుద్దేశ్యంతో!) అమానుషమైన కఠిన శిక్షల్ని నేరస్థులపై విధించేది. ఫాసిస్టుదేశాల్లో కాన్సెంట్రేషన్ క్యాంపులు, కొత్తరకం జైళ్ళు బయల్దేరేయి. శిక్షితులను మంచిమార్గం లోకి తేడానికి (?) జర్మన్ న్యాయశాఖామంత్రివర్గ కార్యదర్శి ఫ్రీస్లర్ యీవిధానం యొక్క మూలసూత్రాన్ని ప్రపంచానికి వెల్లడిచేసేడు. "జైలు అనే మాట తలచుకొనేటప్పటికి గుండె ఆగిపోయేటంత భయో త్పాతం నేరస్థుడిలో కల్గించాలి మన శిక్షావిధానంవల్ల. అప్పుడే నేరాలు చేయడం తగ్గుతుంది."

ఎంత పొరబాటు అభిప్రాయం. వివిధదేశాల్లో యెటువంటి కఠిన శిక్షలవలనా కూడా నేరాలను నిర్మూలించలేక పోయేరన్న సంగతిచూస్తే యీసిద్ధాంతంలో యేమాత్రం నిజం లేదని తెలుస్తుంది. ధనికవాదసమా జంలోని దోపిడీవిధానమూ, దారిద్ర్యమూ, నిరుద్యోగమూ తొలగించ బడనంతవరకు యెన్ని కాన్సెంట్రేషన్ క్యాంపులుకట్టినా, ఘోరశిక్షలు విధించినా నేరాలు తగ్గనే తగ్గవు.

1917 విప్లవం రష్యన్ ప్రజల వర్గసంబంధాలను మంచిమార్గాల్లో పెట్టి, వారి పరస్పరజాతిద్వేషాలను పోగొట్టింది. రియాక్షనరీల వ్యతి రేకత తొలగింపబడింది. వివిధజాతులమధ్య సామరస్యం నెలకొల్ప బడింది. ప్రజాసామాన్యానికి సోషలిజం యొక్క మూలసూత్రాలు బోధింపబడినై. దురాశ, స్వలాభం బదులు సంఘం యొక్క బాగు, స్వార్థత్యాగం ప్రాముఖ్యతలో కొచ్చేయి.

విప్లవానంతరం నుంచీకూడా యీనేరాల సంఖ్య తగ్గుదల చూపుతూ వొచ్చింది. 1909—13 మధ్య సగటున యేడాదికి 13 లక్షల క్రిమినల్ కేసులు విచారణ కొచ్చేయి. 1920 లోనే ఆసంఖ్య 12 లక్ష లకు తగ్గింది. 1922 తర్వాత నుంచి యీమార్పు యింకా స్పష్టంగా కన్పిస్తుంది. 1922—23 లో నేరస్థుల సంఖ్య 100 అనుకుంటే, 1926

నాటికే ఆసంఖ్య 63 వరకూ తగ్గిపోయింది. 1929 లో శిక్షితుల సంఖ్య 60 మాత్రమే: అంటే 1923 లో కన్న కైవంతులు తగ్గిపోయేయన్న మాట. ఎంత సత్వరాభివృద్ధి!

1929 నాటికి సమిష్టి వ్యవసాయపద్ధతి అమల్లో కొచ్చింది. దాంతో లక్షలకొలది రైతులు సోషలిస్టు విధానంలోని కాకర్షింపబడ్డారు. పెద్ద రైతులకూ, బీదప్రజలకూ మధ్యనున్న వైరాలు విస్మరింపబడినై. సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో వుత్పత్తి వెనుకటికంటె యెన్నో రెట్లెక్కువైంది. ఈ స్కీము జయప్రదం కావడం వలన రెండుకోట్లమంది రైతులు పూర్వపు దారిద్ర్యంనుండీ, బానిసత్వంనుండీ విముక్తులై సోవియటు ప్రభుత్వానికి బాసటగా నిలబడ్డారు.

ఈ సోషలిస్టు విజయం చూసి వెనకటి భూస్వాములు, యితర ధనికవర్గీయులూ వుక్రోషం పట్టలేక, సమిష్టి వ్యవసాయస్కీమును నాశనంచేయ దలపెట్టి, ఆక్షేత్రాల సమిష్టి ఆస్తులను దోపిడీ చేయడం, క్షేత్రసభ్యుల పశువుల్ని చంపేయడం, గింజలను తగలబెట్టడం మొదలైన దుండగపు పనులు చేయసాగేరు. అందుమూలంగా ఆసంవత్సరం (1931) నేరాలు, ముఖ్యంగా చోరీలు యెక్కువయేయి. అప్పుడు సోషలిస్టుఆస్తి రక్షణకుగాను 1932 ఆగష్టులో ఒక శాసనం చేయబడింది. "సోవియటు విధానం "ఆస్తి అంతా ప్రజలదే" అదే పునాదిపై నిర్మితమైంది. అట్టి ప్రజాసంపదకు భంగం కల్గించడం అంటే సోవియటు విధానాన్నే కూలద్రోయ తలపెట్టడం అన్నమాట. అందుచే అది అతి కఠిన శిక్షార్హమైన నేరంగా పరిగణింపబడుతుంది." ఈశాసనం అతికఠినంగా అమలు పర్చబడింది. విద్రోహాలు, భూస్వాములు, జమీందార్ల ఆటలు కట్టేయి. సమిష్టిక్షేత్రాలు క్రమంగా బలపడి, బీదరైతుల స్థితి బాగుపడ్డంతో ఆభూస్వాముల కుతంత్రాలకు లోబడే వాళ్లెవరూ లేకపోయేరు. ప్రజలందరూ సోవియటు ప్రభుత్వమే తమ అభివృద్ధికొరకు పనిచేస్తూందని గ్రహించేరు. దొంగతనాలూ అవీ తగ్గిపోయేయి.

ఇటువంటివి కొన్ని శాసనాలు చేసినప్పటికీ, పూర్తిగా వాటితోనే యీసమస్యాపరిష్కారం చేయవలెనని సోవియటు ప్రభుత్వం యెన్నడూ భావించలేదు. నిరుద్యోగం, దారిద్ర్యం, పీడనాపద్ధతి ; యివి నిర్మూలింపబడ్డంతో నేరాలు జరగడానికి కావలసిన వాతావరణమే పోయింది. నేరాలు తగ్గిపోయేయి. 1932 ఆగస్టు శాసనంక్రింద 1936 లో శిక్షితులైనవారి సంఖ్య 1935 దానిలో 30% మాత్రమే ; 1937 లో ఆసంఖ్య వెనుకటిదానిలో పదోవంతు మాత్రమే ! (10% ; )

1935—37 మధ్య సోవియటు యూనియను మొత్తంమీద నేరాల సంఖ్య 28% తగ్గింది. 'జువెనైలు క్రిమినల్సు' (కుఱ్ఱనేరగాళ్లు) యొక్క సంఖ్యకూడ చాలవరకు తగ్గింది. వారి విషయంలో ప్రభుత్వం అమితమైన సానుభూతి, వారిని మార్గంలో పెట్టడానికి చాల శ్రద్ధా కన్పరిచింది.

ఈ గొప్ప మార్పులన్నిటికీ కారణం సోషలిజంయొక్క చారిత్రాత్మకమైన అఖండవిజయమే. సోవియటు యూనియనులో యేయితర దేశంలోనూ జరగడాని కవకాశంలేని గొప్పసంగతి ఒకటుంది. ఎంతమందో నేరస్థులు తమంతట తాము ప్రొక్యురేటరు (విచారణాధికారి) ఆఫీసుకు వొచ్చి, తమ నేరాన్నంగీకరించి, నిజమైన పశ్చాత్తాపంతో యిక ముందు గౌరవజీవితం గడపవలెనని వుందనీ, అందుకు తగిన సలహా, సహాయమూ ఇయ్యవలసిందనీ కోరుతారు. అటువంటి వారి విషయంలో ప్రొక్యురేటరు ఆఫీసు యెంతో సానుభూతి కన్పర్చి, వారికి జీవనాధారం కల్పించడానికి సహాయం చేస్తుంది. 1937 ఏప్రిల్లో ఒక్క మాస్కోలో 600 మంది యీవిధంగా తమనేరాల నంగీకరించి పశ్చాత్తాపం వెల్లడించేరు. అందులో 530 మందికి—వారిలో అనేకులు పాత నేరస్థులే—వృత్తులు కల్పింపబడినై.

అనేకమంది నేరగాళ్లు ప్రొక్యురేటరుకి వుత్తరాలు వ్రాస్తుంటారు తమకొక నూతన జీవితవిధానం చూపించవలసిందని కోరుతూ.

బ్రెవోస్నోవ్ అనే అతడు వ్రాసిన వుత్తరంలో భాగం యిది: "నేను వెనక చాల నేరాలుచేసి అనేకసార్లు శిక్షింపబడ్డాను. నేనిప్పుడు పశ్చాత్తాపం పొందుతున్నాను. విషయాలన్నీ ముఖతః మీకు వివరంగా చెప్పుకొనేందుకు నాకు తగిన అవకాశం యివ్వవలసిందని కోరుతున్నాను." అతడుచెప్పినదంతావిని, అతనికో పని యిచ్చేరు. కొన్నాళ్ళకతడు ప్రొక్యురేటరుకు మళ్ళీ వుత్తరం వ్రాసేడు; "నాకు మీరు చూపించిన సానుభూతికీ, ఇచ్చిన సహాయానికీ చాల కృతజ్ఞుణ్ని. గౌరవజీవనం గడపవలెననే వుద్దేశ్యం ఒక్కటి వుంటేసరి. వారిని సరియైన జీవిత పథంలో పెట్టడానికి తగిన పద్ధతులన్నీ సోవియటు ప్రభుత్వానికి తెలుసునని నాకు దృఢవిశ్వాసం కల్గింది. నేరస్థులందరకూ నాదొక్కటే సలహా, "మీరందరూ మీవెనకటి నికృష్టజీవితాలను మరచిపోండి. ఒక కొత్త జీవితం—అతి గౌరవమర్యాదలతో కూడినది—మీయెదుట వుంది. మీకు దాన్ని పొందాలి అనే యిచ్ఛవుంటే చాలు. మీరు దానిని సాధించగలరు. వెంటనే కొత్తజీవితమార్గంలో ప్రవేశించండి. గౌరవజీవనం గడపండి." ప్రస్తుతం నేను మోటారు మెకానికుగా పనిచేస్తున్నాను. పూర్వపుదొంగ-నేడు మెకానికు; ఒక గౌరవనీయుడైన పౌరుఁడు. ఇట్టి అద్భుత పరివర్తన ఒక్క సోవియటు ప్రభుత్వవిధానంలోనే సాధ్యం."

కొత్తపనుల్లోచేరిన యీ పశ్చాత్తాపులందరూ తమ విధులను చాల జాగ్రత్తగా నిర్వహిస్తున్నారు. వీరందరూ — యీనేరగాళ్లని పిలువబడే వారంతా — యితరదేశాల్లో సంఘానికి వేరు పురుగులుగా, యెందుకూపనికిరాని తుక్కుగా పరిగణింపబడతారు. కాని సోవియటు సమాజంయొక్క దృష్టిలో వీరంతా విధిలేక పెడదోవలుపట్టిన సామాన్యమానవులే; అందుచేత వారికి సరియైన జీవితమార్గంచూపించి, సమాజాభివృద్ధి కార్యక్రమంలో వారుకూడా పాల్గొనేటట్లు చేస్తుంది. వారుకూడా సోషలిస్టుసమాజ నిర్మాతలౌతారు కాలక్రమాన. బాల్టిక్-శ్వేత సముద్రాలు కలిపే కాలువ, మాస్కో-వోల్గా కాలువ మొదలైనవి త్రవ్వడానికి పాతనేరస్థులనే వినియో

గించేరు. చెమటోడ్చి, కష్టించి గౌరవజీవనం చేయడంయెలాగో, శ్రమ జీవికి యెంత ఆత్మసంతృప్తి కల్గిస్తుందో వారికి ప్రత్యక్షంగా బోధపడింది. జీవితసమస్యలపట్ల వారి వెనుకటి దృక్పధమే మారిపోయింది.

సోవియటు ఆర్థికవిధానంలో ప్రతి మానవుడు గౌరవంగా సుఖ జీవనంగడుపుట కవకాశాలున్నాయి. ఒక క్రొత్తవిజ్ఞానాన్ని నెలకొల్పి, ప్రజలను విద్యావంతులనుజేసి, వారిజీవనవిధానాన్ని, వారిమానసిక తత్వాన్ని పూర్తిగా మార్చివేసింది సోషలిజం; ఇతర ప్రపంచంయెడల, యితర ప్రజలయెడల, సమాజంపట్ల ఒక నూతనదృక్పథాన్ని కల్గించింది వారిలో. ప్రతిసోవియటు పౌరునకూ పనిచేసేహక్కు (రైట్ టు వర్క్) వుంది. సోవియటుప్రభుత్వం దానిని పౌరుల ప్రాథమిక స్వత్వంగా గుర్తించి, నూతనరాజ్యాంగచట్టంలో దానికి ప్రాముఖ్యతనిచ్చింది. సోష లిస్టు విప్లవంసాధించిన మహత్తరవిజయాల్లో యిది ఒకటిగా పరిగణింప బడుతూంది.

సోవియటు పౌరులందరికీ సుఖజీవనం గడుపుటకు కావలసిన భౌతికవస్తుసముదాయాన్ని చాలినంతగా సప్లైచేయడంమూలంగావే, పురాతన మానవప్రపంచంయొక్క 'మచ్చ' అనదగిన యీ కళంక ములు — దొంగతనం, పేచీకోరుతనం, లాలసత్వం, రౌడీజం, యిటు వంటివన్నీ తొలగించబడినాయి. నూతన సోవియటురాజ్యాంగవిధానంలో యీవిషయం గుర్తించబడింది. తాతముత్తాతలనాటి పురాతన శిక్షాస్మృతిని, నేటికి ఒక్క సోవియటుదేశమే మార్పుచేయగలిగినదేమి? కారణం స్పష్టమే. సమాజం నూతనమైన సోషలిస్టు పద్ధతులపై పునర్నిర్మింప బడడం, ఆర్థికవ్యవస్థలోనే అందరికీ న్యాయంజరుగుట కాధారంవుండ డం, సోషలిస్టు సంస్కృతి ప్రజల్లో వ్యాపించుతూన్న కొద్దీ వారిలోని న్యాయదృష్టి, సమానత్వం, సహోదరభావం పెంపొందడం — యిందు మూలంగా సోవియట్ ధర్మశాస్త్రం, శిక్షాస్మృతీ, — అనన్యపూర్వమైన నూతనఅభివృద్ధుల్ని చూపుతూన్నాయి।

# అనుబంధము.

—సోవియట్ యూనియన్ వైశాల్యం 83,48,100 చదరపు మైళ్లు.

—జనసంఖ్య నేడు సుమారు 22 కోట్లు.

—సుమారు 150 వేర్వేరుభాషలు మాట్లాడుతారు.

—గ్రంధప్రచురణ 120 భాషలలో జరుగుతూంది.

—వీరంతా 189 ప్రత్యేక జాతులకు చెందివున్నారు.

రష్యన్
బైలోరష్యన్
యుక్రేనియన్
జర్మన్
పోలిష్
ఫిన్నిష్
లిథువేనియన్
లత్వియన్
ఇస్టోనియన్
కరేలియన్
ఉగ్రియన్
మోల్డావియన్
జార్జియన్
ఆర్మీనియన్
గ్రీక్
ఇరానియన్
కకేషియన్
పర్ష్యేషియన్

తాజిక్
తార్తార్
కజాక్
కరగ
కబార్డిన్
కాల్ముఖ్
అజర్‌బైజాన్
అబ్ఖాసియన్
దాఘేస్తానీ
కిర్గిజ్
కుమంచ్
కేత్
సమోయిడ్
వోగుల్
ఓస్త్యాక్
చువాష్
బష్కిర్
ఉర్మత్

చైనీస్
మారీ
తుంగు
ఖట్రి
సుస్సి
గోల్డ్
గిల్యాక్
యుకాగిర్
యుక్లోవిసుకా
యుగులాసియనా
యాకుత్
లాప్
ఎస్కిమో
ఉడురాత్
శవకార్
వోతియక్
శిధియన్
పెర్షియన్

| | | |
|---|---|---|
| టర్కోమన్ | ఉస్బెక్ | ఖజార్ |
| యూదు | ఇవెన్కి | అజారియన్ |
| జిప్సీ | నెన్సీ | యింగుష్ |
| కుర్డ్ | టిబెటన్ | చిచెన్ |
| నీగ్రో | మంగోలియన్ | క్రిమియజా |
| కారా-కల్పక్ | బుర్యత్ | |

మొదలగు జాతుల ప్రజలున్నారు. వీరు ప్రకృత్యుపాసన, అణిమా వాదం, బౌద్ధ, క్రిస్టియన్, మహమ్మదీయాది 40 మతములకు చెందిన వారై వుండిరి.

## దేశవిభాగములు, వాటిహక్కులు, అధికారములు.

యూనియన్ ఆఫ్ రిపబ్లిక్స్ : 16 రిపబ్లిక్ల కేంద్రం. సుప్రీం సోవియట్ యొక్క రెండు శాసనసభలూ, కేంద్రమంత్రివర్గమూ,- వీటిద్వారా పరిపాలనా, శాసననిర్మాణం—జరుగుతాయి. దేశరక్షణ, బ్యాంకింగ్, రైల్వేలు, నాణెములు, లోహపరిశ్రమలు, ప్లానింగ్ మొదలైనవి కేంద్రబాధ్యతలు.

రిపబ్లిక్స్ : ఇవి వివిధరాష్ట్రములవంటివి. వీటికన్నిటికీ కేంద్రంలోంచి విడిపోయే హక్కుతోసహా అన్నిహక్కులూ వున్నాయి. రాష్ట్రీయవ్యవహారములు, తేలిక పరిశ్రమలు, వ్యవసాయం, విద్య, ఆరోగ్యం, ఆర్థికం మొదలైనవి రాష్ట్రబాధ్యతలు. 1944 లోని నూతన సవరణల ననుసరించి అంతర్ రాష్ట్రీయ, విదేశవ్యవహారములు, ప్రత్యేకసైన్యములను కలిగియుంచుటకూడా రాష్ట్రహక్కులుగా సంక్రమించేయి.

మిగిలిన ఉపవిభాగములు : అటానమస్ రిపబ్లిక్, అటానమస్ రీజియన్, నేషనల్ ఏరియా, నేషనల్ డిస్ట్రిక్ట్ అనునవి ఒకదానికంటె మరొకటి చిన్నవి. వీటిల్లో వేరువేరుభాష, సంస్కృతి గల చిన్నచిన్న జాతులు నివసిస్తున్నాయి. వీటికన్నిటికీ తమ భాషను స్కూళ్లలోనూ, ప్రభుత్వవ్యవహారాల్లోనూ ఉపయోగించుకొనేహక్కు, తమ అంతరంగికవ్యవహారాల్లో సంపూర్ణాధికారం కలిగి వున్నాయి.

తూర్పు సైబీరియాలో అమూర్ నదీతీరాన యూదులకు ప్రత్యేకంగా బీరో-బిడ్జాన్ ఆటానమస్ రీజియన్ వుంది. హీబ్రూభాష, సంస్కృతి అచ్చట పెంపొందించబడుతూన్నాయి.

నల్లసముద్రతీరంలో నీగ్రోలకై ఒక సోవియట్ యేర్పడి, సర్వాధికారాలతో వర్ధిల్లుతూంది.

రష్యన్ ఫెడరేటెడ్ రిపబ్లిక్ లోని 16 ఆటానమస్ రిపబ్లిక్ లు

| | |
|---|---|
| 1. తార్తార్ | 9. మారీ |
| 2. బాష్కిర్ | 10. మోర్డ్వా |
| 3. దాఘేస్థాన్ | 11. వోల్గా-జర్మన్ |
| 4. బుర్యత్-మంగోల్ | 12. ఉత్తర ఒస్సేతియన్ |
| 5. కబార్డినో-బాల్కేరియా | 13. ఉద్మర్ట్స్కా |
| 6. కాల్ముఖ్ | 14. ఛిఛెన్-యింగుష్ |
| 7. కోమి | 15. ఛువాస్ |
| 8. క్రిమియా | 16. యకూతియా |

ఇవిగాక దీనిలో 16 ఆటానమస్ రీజియనులు, మరెన్నో నేషనల్ యేరియాలూ వున్నాయి.

—అజెర్బైజాన్ రిపబ్లిక్ లో 1. నకిచేవాన్ ఆటానమస్ రిపబ్లిక్ వుంది.

—జార్జియన్ రిపబ్లిక్ లో 1. అబ్ఖాసియన్, 2. అద్జార్ ఆటానమస్ రిపబ్లిక్ లున్నాయి.

—ఉజ్బెకిస్థాన రిపబ్లిక్ లో 1. కారా-కల్పాక్ ఆటానమస్ రిపబ్లిక్ వుంది.

అన్నిటిలోనూ మరెన్నో ఉపవిభాగాలు వున్నాయి.

# సోవియట్ యూనియన్ బడ్జెటు.

## 1941. (కోట్ల రూబుల్సులో)

| ఆదాయం. | | వ్యయం. | |
|---|---|---|---|
| టర్నోవర్ టాక్సు (పరిశ్రమలు, ప్రభుత్వవ్యాపారం, కో-ఆపరేటివులు మొ॥ వానిపై) | 12,450 | జాతీయార్థికవ్యవస్థాభివృద్ధి (కొత్తఫాక్టరీలు, గనులు, విద్యుచ్ఛక్తి మొ॥) | 5,932 |
| లాభాలపన్ను | 3,100 | వ్యవసాయం (ఇరిగేషన్, ట్రాక్టరుస్టేషన్లు, పరికరాలు మొ॥) | 1,358 |
| స్టేట్ సోషల్ ఇన్స్యూరెన్సు | 1,000 | సోషల్ & కల్చరల్ సర్వీసులు (విద్య, ఆరోగ్యం, పెన్షన్లు, శానటోరియములు) | 4,780 |
| ఆదాయపు పన్ను | 1,084 | దేశరక్షణ | 7,090 |
| యితర ఆదాయాలు | 2,749 | యితర ఖర్చులు | 2,445 |
| ప్రభుత్వ ఋణాలు | 1,300 | | |
| మొత్తం ఆదాయం | 21,684 | మొత్తం | 21,605 |
| 1940 లో ఆదాయం | 17,921 | 1940 లో ఖర్చు | 17,646 |

1940 ఆదాయంకంటె 21% న్నూ, ఖర్చులకంటె 23% న్నూ 1941 లో హెచ్చు.

జనసంఖ్య
కార్మికులు : ఉద్యోగులు
ప్రాధమిక, మాధ్యమిక
స్కూళ్ళ విద్యార్థులు
శిశు సంరక్షణాలయాల్లో
కిండరు గార్డెనులలో
వృత్తి విద్యాలయాల్లో
కాలేజీల్లో
హాస్పిటల్ బెడ్స్
పుస్తకాలు
వార్తాపత్రికలు
ధాన్యాలు

**1947** సం॥రం బడ్జెటు. (కోట్ల రూబుల్సులో.)

| | వ్యయం. | |
|---|---|---|
| 20 080 | సోషల్ ఇన్సూరెన్సు | 1,300 |
| 2,100 | ప్రజాసౌకర్యాలు | 380 |
| | వ్యాపారాభివృద్ధికి | 300 |
| 2,540 | పరిశ్రమాభివృద్ధికి | 6,380 |
| 360 | వ్యవసాయాభివృద్ధికి | 1,690 |
| 7,960 | బిడ్డలతల్లులకు బహుమతులు | 400 |
| | రహదారీ సౌకర్యాలు | 1,080 |
| | విద్యా, ఆరోగ్యం మొ॥ | 4,990 |
| | శాస్త్ర పరిశోధనలు | 500 |
| | దేశరక్షణ | 7,200 |
| | యితర ఖర్చులు | 7,710 |
| 33,040 | మొత్తం ఖర్చు | 31,930 |
| 26,870 | 1946 లో ఖర్చు | 26,390 |

రానియను అభివృద్ధి

| 1940 | 1950 నాటికి |
|---|---|
| 19·30 | 24·00 కోట్లు |
| 3·04 | 3·35 ,, |
| 3·50 | 3·98 ,, |
| 724 | 1 251 వేలు |
| 1,157 | 2,260 వేలు |
| 951 | 1,280 ,, |
| 608 | 675 ,, |
| 840 | 985 ,, |
| 70·10 | 115·60 కోట్లు |
| 3·80 | 5 98 ,, |
| 11·95 | 12·70 కో॥ టన్నులు |

# సోవియట్ యూనియను అభివృద్ధి

| | 1913 | 1940 | 1950 నాటికి |
|---|---|---|---|
| బీట్ దుంపలు | 1·09 | 2·10 | 2·60 ,, |
| ప్రత్తి | 0·07 | 0·25 | 0·31 ,, |
| ట్రాక్టర్లు | 0· | 5·23 | 7·20 లక్షలు |
| ఎలక్ట్రిసిటీ | 1·90 | 50·00 | 82·00 బిలియన్ కిలోవాట్స |
| ఆయిల్ | 0·92 | 3·42 | 3·54 కోట్ల టన్నులు |
| బొగ్గు | 2·57 | 16·46 | 25·00 ,, |
| ఉక్కు | 0·42 | 1·84 | 2·54 ,, |
| పారిశ్రామికోత్పత్తి | 1,100 | 12,035 | 20,500 కోట్ల రూబులు |
| ప్రభుత్వబడ్జెటు | 667 | 17,325 | 40,500 కోట్ల రూబులు |

| రిపబ్లిక్ పేరు | ముఖ్యపట్టణం | వైశాల్యం చ॥ మైళ్ళు | 1939 లో జనసంఖ్య వేలలో |
|---|---|---|---|
| 1. రష్యన్ ఫెడరేటెడ్ | మాస్కో | 63,75,000 | 109,000 |
| 2. యుక్రెయిన్ | కీవ్ | 2,02,540 | 40,000 |
| 3. బైలోరష్యన్ | మిన్స్క్ | 89,300 | 10.386 |
| 4. ఉజ్బెకిస్థాన్ | తాష్ఖెంట్ | 1,64,000 | 6,606 |
| 5. కజాక్స్థాన్ | ఆల్మా-ఆతా | 10,59,700 | 6.146 |
| 6. అజెర్బైయిజాన్ | బాకూ | 33.200 | 3,210 |
| 7. జార్జియన్ | టిఫ్లిస్ | 29,875 | 3,542 |
| 8. ఆర్మీనియన్ | ఎరీవాన్ | 11,580 | 1,282 |
| 9. తాజికిస్థాన్ | స్టాలినాబాద్ | 55,545 | 1,485 |

| రిపబ్లిక్ పేరు | ముఖ్యపట్టణం | వైశాల్యం చ॥ మైళ్ళు | 1939 లో జనసంఖ్య వేలలో |
|---|---|---|---|
| 10. కిర్ఘిజ్‌స్థాన్ | ఫ్రుంజీ | 75,950 | 1,460 |
| 11. టర్క్మన్‌స్థాన్ | అష్ఖాబాద్ | 1,71,250 | 1,254 |
| 12. ఇస్థోనియను | తల్లిన్ | 18,050 | 1,131 |
| 13. లత్వియను | రీగా | 24,700 | 1,971 |
| 14. లిథుయేనియను | విల్నియస్ (విల్నా) | 22,800 | 2,880 |
| 15. మోల్డావియను | కిషినేవ్ | 13,880 | 2,200 |
| 16. కరేలో-ఫిన్నిష్ | పిత్రోజవోడ్స్క | 64,220 | 889 |

# విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

| | | |
|---|---|---|
| 1. | విప్లవ సందేశం | 0—8—0 |
| 2. | లెనిన్ ఉపదేశాలు | 1—0—0 |
| 3. | బలిదాన్-నాటకం | 1—0—0 |
| 4. | సోవియట్ ప్రజాస్వామ్యం | 0—12—0 |
| 5. | నాద్యా (కధాసంపుటి) | 1—0—0 |

## రాబోవు గ్రంధాలు

| | | |
|---|---|---|
| 1. | టాల్‌స్టాయి కధలు | 1—0—0 |
| 2. | గోర్కీ కధలు | 1—0—0 |
| 3. | చెకోవ్ కధలు | 1—0—0 |
| 4. | గోర్కీ జీవితం. | 1—0—0 |

తెలుగులో వెలువడిన యితర గ్రంధాలు కూడ మావద్ద దొరకును. పుస్తక వ్యాపారులకూ, లైబ్రరీలకూ కమీషన్ యివ్వబడును.


విశ్వసాహిత్యమాల,
అవంతీ ప్రెస్ బిల్డింగ్స్, రాజమండ్రి.

అవంతీ ప్రెస్ - రాజమండ్రి. (ఆ. ఉ. 91. 22-11-46.)
Q. H No. E.G 75, Copies 500.

# విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

| | | |
|---|---|---|
| 1. | విప్లవ సందేశం | 0—8—0 |
| 2. | లెనిన్ ఉపదేశాలు | 1—0—0 |
| 3. | బలిదాన్-నాటకం | 1—0—0 |
| 4. | సోవియట్ ప్రజాస్వామ్యం | 0—12—0 |
| 5. | నాద్యా (కధాసంపుటి) | 1—0—0 |

## రాబోవు గ్రంధాలు

| | | |
|---|---|---|
| 1. | టాల్‌స్టాయి కధలు | 1—0—0 |
| 2. | గోర్కీ కధలు | 1—0—0 |
| 3. | చెకోవ్ కధలు | 1—0—0 |
| 4. | గోర్కీ జీవితం. | 1—0—0 |

తెలుగులో వెలువడిన యితర గ్రంథాలు కూడ మావద్ద దొరకును. పుస్తక వ్యాపారులకూ, లైబ్రరీలకూ కమీషను యివ్వబడును.

## విశ్వసాహిత్యమాల,
అవంతీ ప్రెస్ బిల్డింగ్స్, రాజమండ్రి.

అవంతీ ప్రెస్ - రాజమండ్రి. (ఇ. జి. 91. 22-11-46.)
O. H No. E. G 75, Copies 500.